# THE RISE AND FALL OF A BUREAUCRAT

*Mr. J. Alexander who belongs to 1963 batch of I.A.S. cadre allotted to Karnataka Government declared his asset as a tiled house in Kerala where he comes from. By his own skill and with the co-operation of politicians he alleged to richest bureaucrat in the country. A chargesheet was filed against him disclosing list of assets earned by unknown sources.*

## List of assets disclosed by Government

BANGALORE: April 1 - Following is the list of assets alleged to be owned by Mr. Alexander and released by the Karnataka Lokayukta Police:

- A three storey house in the name of J. Alexander at Chinmoya Mission Hospital Road, Bangalore.

- A three bedroom flat in Kairali apartment in the name of Mrs. Alexander at Cochin.

- A palatial house constructed in 1983-84 in the name of Mrs Betty John at Indira Nagar and rented out to Indian Distilleries and Breweries Ltd.

- A three bedroom apartment situated in Ranka Plaza in the name of his son Mr. Johnson Alexander.

# మిసిమి

*"All that we are is the product of what we have thought,"*
*is "We are what we think."* – **Dammapada.**


సంపుటి 4 | మే 1993 | సంచిక 10

సంపాదకుడు: రవీంద్రనాథ్ ఆలపాటి


## విషయసూచిక


హిందూతత్వంలో సాగుతున్న
అంతర్ ఘర్షణ! – సురమౌళి

ఫ్రెంచి విప్లవం నుండి స్వీకరించిన
నవ్య మానవవాదమే గురజాడ తత్వం - ఆర్.ఎస్. సుదర్శనం

సూపర్ మాన్ తత్త్వవేత్త నీషే - బి. తిరుపతిరావు

అభినవాంధ్ర సాహిత్యము - కవికోకిల దువ్వూరి రామిరెడ్డి

ప్రేమించడం ఒక కళ - అన్నపరెడ్డి వెంకటేశ్వర రెడ్డి



విడిప్రతి రూ. 5/- వార్షిక చందా రూ. 60/-


ముఖచిత్రం

VICTORY OF INDRAJIT
Oil on canvas by
Raja Ravi Varma, 1905.

# LIVING DICTIONARY

## (DEVIL'S DICTIONARY)

*Compiled by*
AMBROSE BIERCE (1911)

**Glutton,** *n.* A person who escapes the evils of moderation by committing dyspepsia.

**Gnostics,** *n.* A sect of philosophers who tried to engineer a fusion between the early Christians and the Platonists. The former would not go into the caucus and the combination failed, greatly to the chagrin of the fusion managers.

**Gnu,** *n.* An animal of South Africa, which in its domesticated state resembles a horse, a buffalo and a stag. In its wild condition it is something like a thunderbolt, an earthquake and a cyclone.

**Good,** *adj.* Sensible, madam, to the worth of this present writer. Alive, sir, to the advantages of letting him alone.

**Gout,** *n.* A physician's name for the rheumatism of a rich patient.

**Grammar,** *n.* A system of pitfalls thoughtfully prepared for the feet of the selfmade man, along the path by which he advances to distinction.

**Grapeshot,** *n.* An argument which the future is preparing in answer to the demands of American Socialism.

**Grave,** *n.* A place in which the dead are laid to await the coming of the medical student.

**Gravitation,** *n.* The tendency of all bodies to approach one another with a strength proportioned to the quantity of matter they contain-the quantity of matter they contain being ascertained by the strength of their tendency to approach one another. This is a lovely and edifying illustration of how science, having made A the proof of B, makes B the proof of A.

**Guillotine,** *n.* A machine which makes a Frenchman shrug his shoulders with good reason.

**Habeas Corpus** . A writ by which a man may be taken out of jail when confined for the wrong crime.

**Habit,** *n.* A shackle for the free.

**Hades,** *n.* The lower world; the residence of departed spirits; the place where the dead live.

**Hand,** *n.* A singular instrument worn at the end of a human arm and commonly thrust into somebody's pocket.

**Happiness,** *n.* An agreeable sensation arising from contemplating the misery of another.

**Harangue,** *n.* A speech by an opponent, who is known as an harangue-outang.

**Harbor,** *n.* A place where ships taking shelter from storms are exposed to the fury of the customs.

**Harmonists,** *n.* A sect of Protestants, now extinct, who came from Europe in the beginning of the last century and were distinguished for the bitterness of their internal controversies and dissensions.

**Hash,** *x.* There is no definition for this word-nobody knows what hash is.

**Hatchet,** *n.* A young axe, known among Indians as a Thomashawk.

"O bury the hatchet, irascible Red,
For peace is a blessing," the White Man said.
The Savage concurred, and that weapon interred,
With imposing rites, in the White Man's head.

*John Lukkus.*

***Hatred,*** *n.* A sentiment appropriate to the occasion of another's superiority.

**Hearse,** *n.* Death's baby-carriage.

# హిందూతత్వంలో సాగుతున్న అంతర్ ఘర్షణ!

– సురమౌళి

''హే భారతమాతా! మాకు 'శివ' మానసాన్ని, 'కృష్ణ' హృదయాన్ని, 'రామ' కర్తవ్య పరాయణతను ప్రసాదించు! కొలతలు లేని అమేయ మానసంతో, హద్దులు లేని అతీత హృదయంతో, పరిమితులు అతిక్రమించని జీవితాచరణతో మమ్మల్ని సృష్టించు!''

ఎవరో దైవభక్తుని ప్రార్థన కాదిది. దైవ విశ్వాసం లేని డాక్టర్ రామ మనోహర లోహియా నోట వెలువడిన ప్రార్థన వంటి ఆకాంక్ష ఇది.

ప్రముఖ సోషలిస్టు నాయకునిగా, ద్రష్టగా ప్రపంచంలో డాక్టర్ లోహియా పేరు చిరకాలం ఉంటుంది. ఆయన ఆకాంక్ష, ఆయన రాజకీయ సిద్ధాంతం ''మన నదులను కలుషితం చేస్తున్న నిర్లక్ష వైఖరిని తీవ్రంగా నిరసించే వరకు విస్తరిస్తుంది.'' 'తీర్థం' అంటే ఏమిటి? నీరే కద? మన నదులను అతిఘోరంగా నిర్లక్ష్యం చేస్తుండటం పట్ల ఆయన ఆందోళన చెందారు. అయోధ్య, కాశీ, రామేశ్వరం, ద్వారక, అజ్మీర్ తీర్థస్థానాలను ఘోరంగా నిర్లక్ష్యం చేయడం పట్ల ఆయన సమాన స్థాయిలో ఆవేదన చెందేవారు. ఎవరో ఆస్తికునికి లేదా మతోన్మాదికి కలిగిన ఆందోళన వంటి ఆందోళన సహేతుకంగా ఆలోచించే ప్రతి వ్యక్తీ కాదిది! మామూలు ప్రజల మనిషి ఆందోళన. ''భారతదేశపు ప్రముఖ తీర్థ స్థానాల పునరుద్ధరణ కోసం, పరిశుభ్యం కోసం ఈ దేశ ప్రజల సంక్షేమార్థం దేశీయ విధానాలలో ఆందోళన సాగిస్తాడు'' అని ఆయన అన్నారు.

లోహియా మరణించి 26 సంవత్సరాలైంది. గత మార్చి 23న ఆయన 83న జన్మదినం జరిగింది. భారత రాజకీయ రంగంలో ఆయన పేరు తలుచుకునే వారి సంఖ్య ఈనాడు వేళ్ల మీద లెక్క పెట్టవచ్చు. ఆయన రచనలను అధ్యయనం చేసిన వారికి, ఈనాడు దేశంలో తలెత్తిన మన సమస్యలకు అందులో పరిష్కారం గోచరిస్తూనే ఉన్నది.

'ధర్మయుగ్' హిందీ వారపత్రిక మాజీ సంపాదకులు శ్రీ గణేశ్ మంత్రి, 1950 ప్రారంభంలో రత్లాంలో జరిగిన ఒక పత్రికా గోష్ఠిని గుర్తు చేస్తుంటారు. ''భారత్-పాక్ ఏకీకరణ కోసం మీరిచ్చే పిలుపు, ఆర్.ఎస్.ఎస్., జనసంఘ్‌లు ఇచ్చే అటువంటి పిలుపుకు ఏ విధంగా భిన్నమైంది?'' అని ఒక విలేఖరి ఆయన్ను అడిగారు.

తన పిలుపు భారతదేశంలోని హిందూ, ముస్లిముల మధ్య సగౌరవమైన స్నేహ సంబంధాల ద్వారా సాధించేదని డాక్టర్ లోహియా వివరించారు. నాలుగు దశాబ్దాలు దాటింతర్వాత సైతం, శ్రీ గణేశ్ మంత్రి మనస్సులో, లోహియా ఇచ్చిన జవాబు ప్రతిధ్వనిస్తూనే ఉన్నది: ''ముస్లిం

వ్యతిరేకి అయిన వాడల్లా (భారతదేశంలో) పాకిస్తాన్ అనుకూలుడే!'' అన్నారు డాక్టర్ లోహియా. 'పాకిస్తాన్' అనే భావనను అంతం చెయ్యదలచుకున్న వాడెవరైనా సరే 'ముస్లిం అనుకూలుడై తీరాలి'' అని ఉద్ఘాటించారు.

ఆయన వ్యక్తం చేసిన ఈ విశ్వాసం ఏదో భావావేశంతో చేసిందికాదని లోహియా అనుయాయుల్లో ప్రముఖుడైన ఆచార్య కేల్కార్‌ను కదిలిస్తే వివరిస్తారు. హిందూ - ముస్లిముల మధ్య భేదాభిప్రాయాలున్న మాట నిజమేనని డాక్టర్ లోహియా అంగీకరించే వారు. కాని, అలాంటివి ఉన్నప్పటికీ ఉభయులూ కలిసి జీవించడానికి సృజనాత్మక మార్గాలు రూపొందించు కోవచ్చునని ఆయన నిశ్చయాభిప్రాయం అని వివరించారు ఆచార్య కేల్కార్.

హిందువుల్లోని వేలాది మంది నాస్తికుల్లో లోహియా ఒకరు. మతపరమైన, సంస్కారపరమైన ఆచారాలను ప్రశ్నించి, అభ్యుదయకరమైన మార్పులు జరగాలని ఆకాంక్షించారు. మతాన్ని పూర్తిగా నిరసించడం కాదు; సమ సమాజ వ్యవస్థకు అనువుగా ఆచారాలను సవరించడం.

హిందూ - ముస్లిం సంబంధాల సమస్య కూడా భారతదేశ చరిత్రలో మరొక 'మహా యుద్ధం'' వంటిదేనని డాక్టర్ లోహియా అభిప్రాయం. ఈ యుద్ధం మతోన్మాద హిందువులకూ- ఉదారవాద హిందువులకూ మధ్య సాగుతున్నది. 1950 నాటికే డాక్టర్ లోహియా, ఈనాడు మనకు ఎదురవుతున్న ఆందోళనాకర స్థితిని దర్శించారు. 'హిందూ ధర్మం'లోని ఈ అంతర్ సంఘర్షణ పరిష్కారమైతేగాని నాగరికతకు మనుగడ లేదని లోహియా హెచ్చరించారు.

''హిందూయిజం'' అన్న పేరుతో ప్రచురితమైన, ఆయన ఈ రచన, ఈనాటి పరిస్థితులలో, పూర్తిగా ఏకపక్షంగా బహిరంగ చర్చలు జరుగుతున్న నేపథ్యంలో మార్గదర్శకం కాగలదనడంలో సందేహం లేదు. ''హిందూయిజం''లో ఈ సంఘర్షణ దాదాపు 5 వేల సంవత్సరాలుగా కొనసాగుతున్నది. యావత్ ప్రపంచ చరిత్రలో, పురాణాలు, వేదాంతం, ఆచార వ్యవహారాలు వీటన్నింటి నుండే సాగిన ఈ సంఘర్షణ, జ్ఞాపకం ఉన్నంత వరకూ అతి సుదీర్ఘ సంఘర్షణ. ఈ సంఘర్షణలో ఒక పక్షం దానవత్వానికి దారి తీస్తే, మరొక పక్షం మానవ సంక్షేమానికి, మానవ విలువల ప్రతిష్ఠకు దారి వేసింది, అని డాక్టర్ లోహియా రాశారు.

ఈనాడు ఛాందస హిందువులైతేనేమి, ఉదార హిందువులైతేనేమి, పరస్పర తీవ్ర సంఘర్షణా వైఖరితో సైతం - ఈ సంస్కృతికి - ఈ మతానికి ఉన్న అమోఘమైన లక్షణం 'సహనం' అనేదాన్ని అంగీకరిస్తారు. అంటే దీని అర్థం బహిరంగ యుద్ధాలు జరగనే లేదనికాదు; ఇదివరకు జరిగిన బహిరంగ యుద్ధాలలో 'సహనం' అంతిమ విజయం సాధించింది అనే దీని తాత్పర్యం.

''హిందూ తత్వంలోని ఛాందస మతోన్మాదులు, సర్వదా సారూప్యత ద్వారా సమానత్వ సాధనకు ప్రయత్నించారు. ఆధిపత్యం నెరపదలచుకున్న వారు తమకు భిన్నమైన విశ్వాసాలు కలవారిని, భిన్న మతావలంబులను అణచివేయడం ద్వారా సమైక్యతను సాధించడానికి ప్రయత్నించారు. అయితే ఆ ప్రయత్నాలు ఏనాడూ విజయం సాధించలేదు.'' అంటారు డాక్టర్ లోహియా. ''సహన శక్తి సర్వదా, అత్యాచారశక్తి కన్నా బలీయంగానే ఉండేది''.

మిసిమి, మే 1993

19వ శతాబ్దపు చివరిలో స్వామీ వివేకానందుడు మరొక అడుగు ముందుకు వేసి, హిందూ తత్వాన్ని మరింత ఉదారవంతం చేశారు. 'సహనం' ఒక్కటే కాదు, అందరినీ తమలో లీనం చేసుకోగల అంగీకార వైఖరిని హిందువులు అలవరచుకోవాలన్నాడు. ''వైవిధ్యాలు విధిగా పొరపాట్లే'' కానక్కరలేదు; బహుశా యదార్థాన్ని వ్యక్తపరిచే విభిన్న వ్యక్తీకరణ పద్ధతులు కావచ్చు'' నన్న విశ్వాసం నుంచి ఎదిగిన భారతీయ నాగరకతా శక్తిని డాక్టర్ రామమనోహర లోహియా కూడా దర్శించారు.

ఈనాడు, సారూప్యం ద్వారా సమైక్యతను సాధించాలనే శక్తులు, తమను తాము హిందూత్వ శక్తులుగా వ్యవహరించుకుంటున్నాయి. 'హిందూత్వ' శక్తిని నాయకత్వం వహిస్తున్న వారందరూ అగ్రవర్ణాలకు చెందిన వారే కావడం యాదృచ్ఛికం కాదు. చిన్న కులాల వారికి ఏదో మేలు చెయ్యాలని, వారిని బాగు చెయ్యాలని అంటారు కాని కుల వ్యవస్థనే కూకటి వేళ్లతో నిర్మూలించేందుకు పూనుకోరు. పితృ స్వామ్య వ్యవస్థకు వ్యతిరేకంగా ప్రపంచ మహిళా లోకం సాగిస్తున్న పోరాటాల పట్ల కూడా వారికి సానుభూతి ఉండదు.

ఈ పరిస్థితిని లోహియా గమనించారు. ఇందులో ఆశ్చర్య పడవలసినదేమీ ఆయనకు కనిపించలేదు. ''హిందువు మనస్సు నుంచి, కుల భావన పూర్తిగా నిర్మూలనమయ్యేంత వరకు, పురుషునితో బాటు స్త్రీ కూడా సమాన హోదాగలదిగా ఎదిగే వరకు, వ్యవస్థ భావనతో 'ఆస్తి'కి ఉన్న ముడి విడిపోయే వరకు, ఛాందసులు, ఎప్పటికప్పుడు భారత చరిత్రలో సంక్షోభాలను సృష్టిస్తునే ఉంటారని, సోమరితనాన్ని పెంపొందిస్తూనే ఉంటారని డాక్టర్ లోహియా అన్నారు.

అనేకమంది భారతీయులు మహాత్మాగాంధీ, స్వామీ వివేకానందుల అడుగుజాడల్లో చురుకుగా నడవక పోవడానికి, తరతరాలుగా మన సంస్కృతిలో భాగమై పోయిన ఈ సోమరితనమే కారణమా? ఈ సోమరితనపు వక్రీకరణే, అయోధ్యలో కరసేవకులు సాగించిన విధ్వంసానికి కారణమా? ఏదో ఒక దాడిని, మనలోని చెడుకంతా కారణమని నిందించడానికి పెద్దగా శ్రమించవలసిన పనిలేదు.

అదే విధంగా మహాత్మాగాంధీని నాథూరాం గోడ్సే, సిగ్గూ ఎగ్గూ లేకుండా హత్య చేయడాన్ని కూడా పేర్కొనవచ్చు. లోహియా అభిప్రాయంలో ఈ చర్య హిందూ ముస్లిం తగాదాల వ్యవహారం కానే కాదు. హిందువులలో ఉదారవాదులకూ ఛాందసవాదులకూ మధ్య సాగుతున్న సంఘర్షణ రూపమే మహాత్మాగాంధీ హత్య. కులాలు, మహిళలు, ఆస్తి, సహనం వంటి ఉన్నత విలువలపై హిందువు కూడా అంత తీవ్రంగా ఏనాడూ దెబ్బ తీయలేదు. ఈ విషమంతా లోలోపల ప్రోగవుతూనే కొనసాగింది.

హిందూత్వంలోని ఈ లక్షణం ప్రాధాన్యాన్ని తగ్గించడానికి ఈనాడు హిందువులలోని శిష్ట వర్గాలవారు ప్రయత్నించక తప్పని పరిస్థితి వచ్చింది. గాంధీజీ గొప్పతనం ఇలాంటిది. డిసెంబరు 6వ తేదీన అయోధ్యలో జరిగిన అరాచకాన్ని, ఎదిగి వస్తున్న హైందవ సమైక్యతకు ప్రతీకగా సమర్థించే ప్రయత్నం జరుగుతున్నది. ఎదిగి వస్తున్న ఈ హైందవ సమైక్యతా వైఖరే ఈ దేశ పటాన్ని అవిచ్ఛిన్నంగా ఉంచ గలుగుతుందని ప్రచారం చేస్తున్నారు. చరిత్ర మరొకసారి సృష్టించిన విషాదకర సంఘటనగా డాక్టర్ లోహియా దీన్ని అభివర్ణించి ఉండేవారు. ''(ఛాందసుల) ఉద్దేశాన్ని సర్వదా, ముందుగా ఊహించలేం. కొన్ని సందర్భాలలో స్థిరత్వం - శక్తి సముపార్జనే లక్ష్యంగా ఈ చోదకశక్తి పని చెయ్యవచ్చు. అయితే వారి చర్యల ఫలితం

మాత్రం సర్వదా వినాశకరంగానే పరిణమించింది.... ఛాందస హిందూ మతోన్మాద విజృం భణ ఫలితంగా దేశం సాంఘికంగానూ, రాజకీయంగానూ ముక్కలు కావడం సర్వే సర్వత్రా సంభవించింది. భారత ప్రజానీకం ఒక జాతిగా, ఒక రాజ్య వ్యవస్థగా కూడా మనజాలక ముక్కలై పోయింది.''

అయోధ్య సంఘటనకు దశాబ్దాల పూర్వమే, డాక్టర్ లోహియా, ''హిందూ ఛాందసవాదం పెరిగి పెద్దది కావడానికి, కమ్యూనిజం, ఫాసిజం వంటి ప్రజా స్వామ్య వ్యతిరేక శక్తులు దోహదం చేస్తాయ''ని ఊహించారు. ''ఉదారవాద హిందువులు మాత్రమే భారతదేశాన్ని సమైక్య పరచగలరని లోహియా విశ్వసించారని, ఈనాడు ఉదారవాద హిందువు మరొక సారి ఓటమి చవి చూస్తున్నాడ''ని ఆచార్య కేల్కార్ అంటున్నారు.

అయితే ఛాందస హిందువులు నిర్ణయాత్మక విజయం సాధించారా?

ప్రముఖ సోషలిస్టు, లోహియా అనుయాయి, శ్రీ హిమ్మత్ ఝువేరీ, ప్రజలను ఛాందస హిందువులు - ఉదారవాద హిందువులని, సులభంగా విభజించడం ప్రమాదకరం అని హెచ్చరిస్తున్నారు. మతోన్మాదుల వెనుక అనేకమంది కూడుతున్నట్లు కానవస్తున్న మాట నిజమే. అయితే, స్వతహాగా ముస్లిం వ్యతిరేకులు కానటువంటి అనేకమంది ఉదారవాద హిందువులు, కాంగ్రెసు, సోషలిస్టు కమ్యూనిస్టు పార్టీలు సెక్యులరిజం పేరుతో ఇంత వరకూ అనుసరిస్తూ వచ్చిన విధానాన్ని విమర్శనాత్మకంగా చూస్తున్నారు కనుకనే ఈ పరిస్థితి వచ్చిందని శ్రీ ఝువేరీ వాదన. మన లక్ష్యాలనూ, ఆదర్శాలనూ ప్రజలకు మనం వివరించ లేదు. మన ప్రవర్తనలో ఏదో లోపం ఉన్నందు వల్లనే ప్రజలు థాకరే, అద్వానీల చుట్టూ గుమిగూడుతున్నారని ఆయన వివరించారు.

ఈ వైఖరి తాత్కాలికమైనదే నంటారు శ్రీ ఝువేరి. లౌకిక వాదులు, హిందూ-ముస్లిం ఛాందస మతోన్మాదులను సమానంగా నిరసించే స్థాయికి ఎదిగి, తమ లౌకిక వాద వైఖరిని సవరించుకున్నట్లయితే దీన్ని అధిగమించ వచ్చునని ఆయన అభిప్రాయం.

లోహియా సిద్ధాంతాలను ప్రవచించి వ్యాఖ్యానించడంలో ప్రముఖ, పార్లమెంటు మాజీ సభ్యుడు శ్రీ మధు లిమాయె ఆశావాది. మార్పును కోరే శక్తులు సమాజంలో ఇప్పటికే సచేతనమై పని ప్రారంభించాయని, ఛాందస హిందూ వాదుల విజయాన్ని ఈ శక్తులు అసంభవం చేయగలవని ఆయన అన్నారు. స్త్రీ సమానత్వం, కుల నిర్మూలన సమస్యలపై సంస్కరణోద్యమాలు విభిన్న సంస్థల ద్వారా, కార్యక్రమాల ద్వారా, ఆందోళనల ద్వారా పురోగమిస్తున్నాయని, వాటిని అంత సులభంగా దాటవేయడం సాధ్యంకాదని ఆయన అభిప్రాయం.

ఈనాటి పరిస్థితులలో లోహియా బ్రతికి ఉంటే ఏమి చేసి ఉండేవారు? అన్న ఊహాత్మక ప్రశ్నకు శ్రీ లిమాయె ఊహించి సమాధానం చెప్పారు . ''మత సామరస్యం కాపాడటానికి ప్రభుత్వం అన్ని చర్యలు తీసుకోవాలని కోరడమే కాక, మతకలహాల బారికి గురైన బాధితులకు సహాయ సహకారాలు అందించ వలసిందిగా పొరుగు రాష్ట్రాలను ప్రార్థించేవారు''. అని వివరించారు.

1964లో తూర్పు పాకిస్తాన్ నుంచి హిందువులు, ఇతర అల్పసంఖ్యాకులూ భారతదేశానికి భారీ ఎత్తున శరణార్థులుగా వచ్చినప్పుడు, కూడా భారతదేశంలోని ముస్లిములపై దాడులు

జరిగాయి. అప్పుడు డాక్టర్ లోహియా, అప్పటి జన సంఘం (ఈనాటి భారతీయ జనతా పార్టీ) ప్రధాన కార్యదర్శి శ్రీ దీనదయాల్ ఉపాధ్యాయతో కలిసి ఒక సంయుక్త ప్రకటన జారీ చేశారు. ఆ ప్రకటన ఇలా సాగింది-

''పాకిస్తాన్‌లోని హిందువుల ప్రాణాలనూ, ఆస్తులనూ కాపాడే తన కర్తవ్యంలో భారత ప్రభుత్వం విఫలమైనట్లయితే, భారత ప్రజానీకానికి ఆగ్రహం కలగడం సహజమే. అయితే ఈ ఆగ్రహాన్ని భారత ప్రభుత్వం మీదికి గురిపెట్టాలికాని, భారత దేశంలోని ముస్లిముల మీదికి ఏ పరిస్థితిలోనూ గురిపెట్టరాదని మేం ప్రజలకు విజ్ఞప్తి చేస్తున్నాము. వాళ్ల ప్రాణాలనూ, ఆస్తులనూ, భారత పౌరులందరి ప్రాణాల వలెనే, ఆస్తుల వలెనే పరి రక్షించాలి. తమ పొరుగు వాణ్ని కాపాడలేని పౌరుడు పశుతుల్యుడు. అన్ని మతాల వారిని రక్షించడం మన సంప్ర దాయం.''

జన సంఘం దిగువ కార్యకర్తలందరూ ముస్లింలను హింసించడాన్ని సమర్థిస్తూ ఉన్నతరుణంలో ఇటువంటి సంయుక్త ప్రకటనకు రాజకీయ ప్రాధాన్యం ఉన్నదని శ్రీ మధు లిమాయె, శ్రీ గణేశ్ మంత్రి ఉభయులూ అభిప్రాయ పడ్డారు. ఇలాంటి చర్యల ద్వారా మొదట లోహియా, ఆ తర్వాత జయప్రకాశ్ నారాయణ జన సంఘానికీ, ఆర్.ఎస్.ఎస్.కూ, వారి ముస్లిం వ్యతిరేక వైఖరికీ సమర్థనీయతను ప్రధానం చేశారని ఇతరులు అంటారు.

సమయం గడిచిన కొద్దీ లోహియా, మహత్తరమైన ఆత్మవిశ్వాసం కలిగిన ఉదారవాద హిందువుగా, రక్తపాతం లేకుండా, ఈ సంఘర్షణలో శాశ్వతంగా అమీ తుమీ తేల్చుకోవడానికి ముందుకు రావలసిందని ఎదుటి పక్షాన్ని సవాలు కూడా చేశారు.

అయితే ఛాందసులైన ఎదుటి పక్షం వారి చెవులకు ఇటువంటి విజ్ఞప్తులు సోకుతాయా? 'కాదు' అనే, ఆయనకు పదే పదే వచ్చిన జవాబు. హిందూ తత్వంలో అంతర్గతంగా సాగుతున్న ఈ మహాసంఘర్షణ భవితవ్యం. దీన్ని అర్థం చేసుకుని, అన్ని రకాల ఛాందస ఉన్మాదాలను, తద్వారా వ్యాపించగల అసహ్యపు విష బీజాలను ఎదిరించగల ఆత్మవిశ్వాసం సంకల్ప బలం ఉన్న వారిపైనే ఆధారపడుతుంది. ఈ విశ్వాసాన్ని పంచుకోగలవారు. ఈ వికృత యుద్ధం ముగిసింతర్వాత, భారతీయ మనస్సు లోహియా ఊహించిన రీతిలో వికసించడాన్ని దర్శించవచ్చు.

**మార్చి 28వ తేదీ 'టైమ్స్ ఆఫ్ ఇండియా'లో రజనీ బక్షీ, లోహియా వాదులతో మాట్లాడి రూపొందించిన రచన ఆధారంగా. 'టైమ్స్ ఆఫ్ ఇండియా' సౌజన్యంతో.**

---

## *King Arthur or Adolf Hitler?*

Making an ideology out of prejudice is tantamount to wiping off the human face of religion.

ఫ్రెంచి విప్లవం నుండి స్వీకరించిన

# నవ్య మానవవాదమే గురజాడ తత్వం

– ఆర్.ఎస్. సుదర్శనం

నవ్యసాహిత్యంలో మనకిద్దరు యుగకర్తలున్నారు గురజాడ, రాయప్రోలు. ఏమిటీ తేడా? వారు వ్రాసిన దేశభక్తి గీతాల్ని పరిశీలించండి. ఆనాడు 'వందేమాతరం' గీతం బహుళ ప్రచారాన్ని పొందింది. దేశాన్ని మాతగా, దేవీమూర్తిగా భావించి ఆరాధించడంలో భౌగోళిక స్వరూపం, మతం, సంస్కృతి, చరిత్ర ప్రాధాన్యం వహించాయి. రాయప్రోలువారు ఆ మార్గంలోనే నడిచారు తమ గీతాల్లో. గురజాడ 'దేశమంటే మట్టికాదోయ్, దేశమంటే మనుషులోయ్' అని హెచ్చరిస్తూ 'మంచి అన్నది పెంచుమన్నా' అని ఉద్బోధించారు. సమాజం యొక్క అస్తిత్వం, మనిషిలో మంచితనం మీద ఆధారపడిందని గురజాడ విశ్వాసం. దాని పురోభివృద్ధికి శ్రామికశక్తి మూలం. ''నరుల చెమటను తడిసి మూలం, ధనం పంటలు పండవలెనోయ్.'' అన్నారు. మతసహనాన్నీ, సర్వమానవ సమానత్వాన్నీ ప్రబోధించారు. ఈ భావాలన్నీ నవ్యమానవతా వాదానికి చెందినవి. ఇవి రూసో నుంచీ ఫ్రెంచి విప్లవం (1789) ద్వారా ప్రపంచ వ్యాప్తమైనవి.

నవ్యసాహిత్యంలోని కాల్పనిక వాదంలో రెండు ధోరణులున్నాయి. పాశ్చాత్య దేశాల్లో 16వ శతాబ్దితో ఆగిపోయిన పూర్వ కాల్పనికత ఒకటి. అది మానవతావాదంలో అంతర్భాగ మైనా, రాజరికము, వర్గ విభేదాలూ, ఫ్యూడలిజం, మత విశ్వాసాల జోలికి పోకుండా, వాటిని నేపథ్యంగా స్వీకరించింది. రెండోది రూసోతో 18వ శతాబ్దిలో ప్రారంభమైన ఉత్తర కాల్పని కత. అది నవ్యమానవతా వాదంగా విప్లవ స్వరూపాన్ని ధరించింది. స్వాతంత్ర్యం, సమా నత్వం, సౌభ్రాతృత్వం దీనికి ప్రాతిపదికలు. పూర్వకాల్పనికత షేక్స్పియర్ నాటకాల ద్వారా తెలుగులో రాయప్రోలు, అబ్బూరి, విశ్వనాథ, దువ్వూరి వంటి కవుల రచనల్లో అభివ్యక్తం కాగా, ఉత్తర కాల్పనికత గురజాడలోనూ తర్వాత చలం, శ్రీశ్రీ, బుచ్చిబాబు, గోపీచంద్ వంటి రచయితల్లోనూ వైవిధ్యంతో విస్తరించింది. మన విమర్శకులు షేక్స్పి యర్, వర్డ్స్వర్త్, షెల్లీ, బైరన్, కీట్స్ కవుల్ని అందర్నీ రొమాంటిక్ కవులుగా ఒకే ధోరణిలో చూస్తున్నారు. కాల్పనిక కవిత్వాన్ని ''భావకవిత్వం''గా ముద్రవేసి త్రోసిపుచ్చి, తర్వాత వచ్చినదాన్ని 'అభ్యుదయకవిత', 'విప్లవకవిత'గా, భిన్న ధోరణులుగా పరిగణిస్తు న్నారు. ఇది సరికాదు. షెల్లీ, బైరన్లు ముఖ్యంగా సామాజిక రాజకీయ విప్లవాన్ని గూర్చి వ్రాసిన కవులు. వర్డ్స్వర్త్ గ్రామీణుల్నీ ప్రకృతినీ గూర్చి వ్రాసిన కవి. వ్యక్తిగా మానవుని ఉదాత్తతను ప్రకటించిన కవి. కీట్స్ ప్రేమ కవిత్వంలో భావనాత్మక ప్రేమను తరచిన కవి. రూసో నవ్యమానవతా దృక్పథానికీ, షెల్లీ, బైరన్ వంటి ఆంగ్లకవుల మీద అది చూపిన ప్రభావానికీ ఆంగ్ల విమర్శకులు సరియైన గుర్తింపు ఇవ్వకపోవడమే, తెలుగు విమర్శకుల దృష్టిలోపానికి కారణమని నా భావన. నవ్యసాహిత్యంలో అవిచ్ఛిన్నంగా గురజాడనుంచీ సాగుతున్నది నవ్యమానవతా వాదమే!

రూసో నుంచి స్ఫూర్తి పొందిన ఫ్రెంచి విప్లవం గమ్యంగా స్వీకరించిన మానవ

స్వాతంత్ర్యం, సమానత్వం, సౌభ్రాతృత్వం క్రమంగా ప్రపంచ చరిత్ర గమ్యంగా రూపొందుతూ వచ్చింది. గమ్యాన్ని సాధించడంలో చరిత్ర పరిణామాన్ని రూసో తర్వాత పలువురు మేధావులు పలు విధాల అంచనా వేశారు. వారిలో హెగెల్, మార్క్స్, కామ్టే, స్పెంగ్లర్, టాయిన్‌బీ ముఖ్యులు. మార్క్స్ ప్రతిపాదించిన గతి తార్కిక చారిత్రక పరిణామం ఇరవయ్యో శతాబ్దిలో ప్రాభవాన్ని గడించింది. మార్క్సిజమ్-లెనినిజమ్, శ్రామిక వర్గం రాజ్యాధికారం పొందడం ద్వారా సమానత్వాన్ని అమలుజరిపి, తద్వారా వ్యక్తిలో సౌభ్రాతృత్వాన్ని పెంపొందించి, వ్యక్తి స్వేచ్ఛకు సమాజంలో అర్థస్ఫూర్తిని కలిగించాలని ఉద్యమించింది. ఈ ఉద్యమం వైఫల్యం యిటీవల బయటపడటంతో, జాతులూ దేశాలూ స్వాతంత్ర్యాన్నే నేడు ప్రాథమికంగా పరిగణించడం చూస్తూంటే, మానవజాతిగాని వ్యక్తిగా మానవుడుగాని స్వాతంత్ర్యం ద్వారానే, సమానత్వాన్నీ, సౌభ్రాతృత్వాన్నీ అందుకోగలడని తోస్తుంది. రూసో నుంచి స్ఫూర్తి పొందిన నవ్య మానవతావాది- గురజాడ, వ్యక్తి స్వేచ్ఛకూ, సమాజంలో అతని బాధ్యతకూ గల సంబంధాన్ని నిర్వచించే ప్రయత్నమే 'కన్యాశుల్కం' నాటకంలో చేశారు. ఈ నాటకం కేవలం సంస్కరణ నాటకమే కాదు! హాస్యప్రధానమైన నాటకంగా దాన్ని తీర్చిదిద్దినా, ఆ హాస్యంలో శృంగారం, భయానకం, వ్యంగ్యంగా తొణికిసలాడుతూ నాటకానికి గాంభీర్యాన్ని చేకూర్చి, నాటక యితివృత్తంగా సాంఘిక దురాచారం ఒక్కటే కాకుండా జీవిత సాకల్యాన్ని చిత్రించినట్లయింది. సారా దుకాణం సీను, కోర్టు సీను, బైరాగి, యోగిని, మనవాళ్ళయ్య, వీరేశ, హవల్దారు వంటి పాత్రలూ ఎన్నో ఈ విషయాన్ని నిరూపిస్తున్నాయి.

రూసో నుంచీ స్ఫూర్తి పొందిన మానవతావాదం ఒక వైపు మార్క్సిజమ్ వంటి చారిత్రక దర్శనంగా విస్తరిల్లగా, మరోవైపు అది వ్యక్తి ప్రధానమైన తాత్త్విక ధోరణులకు-రాడికల్ హ్యూమనిజమ్, ఎగ్జిస్టెన్షలిజమ్‌లకు జన్మస్థానమైంది. "Man is born free but is everywhere in chains". స్వతంత్రుడుగా పుట్టే మనిషి బంధనాల్లో చిక్కుకున్నాడు. అతని విముక్తే ధ్యేయం అన్న రూసో వాక్కుని విమర్శించిన వాళ్ళున్నారు. స్వతంత్రుడుగా ఎలా పుడుతున్నాడు? తల్లిదండ్రుల మీదా పరిసరాలమీదా ఆధారపడిలేడా? అని ప్రశ్న. రూసో స్వాతంత్ర్యానికిచ్చిన అర్థం స్వాతంత్ర్యం- ప్రేమ ఒక నాణేనికి రెండువైపులని. తల్లిదండ్రుల ప్రేమ అనే స్వేచ్ఛలో పుట్టినా అనతికాలంలోనే సామాజిక, సంప్రదాయ బంధనాలు అతణ్ణి చుట్టి వేస్తున్నాయి. రూసో సామాజికుడైన మానవుని స్వేచ్ఛకిచ్చిన నిర్వచనం:- "To follow one's impulse is slavery, but to obey the self - prescribed law is liberty". స్వధర్మాన్ని గుర్తించి బాధ్యతతో వ్యక్తి ప్రవర్తించడమే స్వేచ్ఛ అంటాడు. స్వతంత్రులైన వ్యక్తులు సమాజంగా ఏర్పడి-social contract ద్వారా, స్వచ్ఛందంగా చట్టాల్ని, నిబంధనల్ని ఏర్పరచుకోవడమే-"to bind oneself to all while retaining one's free will", సమాజంలో వ్యక్తి అనుభవించే స్వేచ్ఛ అంటాడు. మతసహనాన్ని కూడా రూసో ప్రధానంగా పేర్కొన్నాడు. "The greatest good is not authority but liberty". స్వేచ్ఛయే అన్నిరంగాల్లోనూ అభివృద్ధికీ, వికాసానికీ ప్రాతిపదిక అని రూసో విశ్వాసం. మనిషి స్వతస్సిద్ధంగా మంచివాడని రూసో నమ్మకం, దాని మీదే ఆయన తాత్త్విక దృక్పథం నిలుస్తుంది. మనిషి దుష్టుడు, పాపి, అతణ్ణి సహజాతాలైన దుర్గుణాలనుంచి సంస్కరించాలి అనుకోలేదు రూసో. అందుకే ఆయన క్రైస్తవాన్ని ఆమోదించలేదు. ఆయన ఆస్తిక్యం వ్యక్తిగతమైనది. ప్రకృతితోడి సంవాదంతో కలిగిన అనుభూతి నుంచీ ఆయన రూపొందించుకున్నదే ఆయన ఆస్తిక్యం.

గురజాడ వారి 'కన్యాశుల్కం' నాటకాన్ని పరిశీలిస్తే తెలుస్తుంది రూసో దృక్పథం వారిని ఎంత ప్రభావితుణ్ణి చేసిందో. నాటకంలో ప్రధాన పాత్ర గిరీశం. గిరీశం వ్యక్తి స్వేచ్ఛకు ప్రతినిధి. నేను 1961లో గురజాడ మీద వ్రాసిన వ్యాసంలో ప్రధానంగా గిరీశం పాత్రను విశ్లేషిస్తూ ఒక సూచన చేశాను: ''హాస్యం ప్రసాదించే మానసికమైన స్వేచ్ఛ, దాని తాలూకు ఆహ్లాదమే గిరీశం పాత్ర సారాంశం.'' ఇది ప్రొఫెసర్ బ్రాడ్లీ, ఫాల్‌స్టాఫ్ పాత్రకు చేసిన వ్యాఖ్యానం. గురజాడ వారు గిరీశాన్ని సృష్టించడంలో ఫాల్‌స్టాఫ్ ప్రభావం ఎంత వున్నదో ఆ వ్యాసంలో విపులీకరించాను. గిరీశం యొక్క హాస్యదృష్టి అతణ్ణి జీవిత సమస్యల్లో నుంచీ చాలాసార్లు బయట పడవేస్తుంది. జీవితాన్ని అనుభవించడమే ప్రధానమైన విలువగా గ్రహించి, ఏ నీతికీ, వ్యవస్థకూ, సిద్ధాంతానికీ కట్టుపడకుండా, హాస్యదృష్టితో సర్వాన్నీ గోటమీట గలిగిన గిరీశం స్వేచ్ఛ మనల్ని మిరుమిట్లు గొల్పుతూనే, ఈ స్వేచ్ఛ అతణ్ణి దుష్టుణ్ణి చెయ్యదుకదా అనే సందేహాన్ని కలిగిస్తుంది. గిరీశం యింకా చిన్నవాడు, కాలేజీలో చేరి చదువుకునే వయస్సు మిగిలే వుంది. గిరీశంలో నిభృతంగా మంచితనం వున్నట్లే గురజాడ చిత్రించారు. గిరీశంలో సహజంగానే ఒక ఆర్ద్రత, ఒక స్పందన ఉన్నదనే విషయం నిరూపించారు. అతడు లుబ్ధావధాన్లులాగ లుబ్ధుడుకాడు, రామప్పంతులు లాగ మోహ, మద, మాత్సర్యాల ముద్దకాదు. అగ్నిహోత్రావధాన్లు, బుచ్చమ్మ నెత్తిమీద పెరుగూ అన్నం విస్తరి రుద్ది విలయ తాండవం చేసినప్పుడు గిరీశం నవ్వలేదు! అతని హాస్యదృష్టి ఏమైంది? ఆ యింటికి కొత్తవాడైనా, పట్టణవాసం యువకుడైనా, ''పొయ్యిలో నిప్పేసి, నీళ్లుతోడి, బుచ్చమ్మని స్నానం చెయ్యమన్నాడు.'' బుచ్చమ్మ తల్లి వెంకమ్మ బావిలో దూకిన తరుణంలో, చోద్యం చూచే యిరుగు పొరుగుల్లాకాక, గిరీశం బావిలో దిగి ఆమెను రక్షించాడు. తన యీ 'మంచితనాన్ని' చూచి స్వగతంలో గిరీశం తానే వెరగుపడ్డాడు. అట్లానే బుచ్చమ్మ ముగ్ధత్వం, స్వార్థరాహిత్యం అతనిలో ఆమె పట్ల రేకెత్తించిన వ్యక్తిగతమైన ప్రేమకు గిరీశం జంకాడు. ఇవన్నీ అతని స్వభావంలో మంచితనం నిర్దేశిస్తున్న స్వధర్మమే! కాని ఆ స్వధర్మానికి మనసా కట్టుబడి ఉండాలా? అనే సందేహమే గిరీశాన్ని వేధిస్తుంది. ఆ మంచితనం తన స్వేచ్ఛకూ, స్వచ్ఛంద జీవితానుభూతికీ, తన సుఖ సంతోషాలకూ అవరోధం అవుతుందేమో అనే శంక అతన్ని వదలలేదు! బాధ్యతల్ని స్వీకరించి బుచ్చమ్మను పెళ్ళాడే అర్హత పొందమని సౌజన్యారావు సూచించగా, అలా చెయ్యాలా, వద్దా, అనే ప్రశ్నతో గిరీశం నాటకాంతంలో మిగిలాడు.

చివరి రంగంలో సౌజన్యారావు, మధురవాణి, గిరీశాల మధ్య జరిగిన సంభాషణ యావత్తూ 'మంచితనా'న్ని గూర్చిన చర్చ. సౌజన్యారావు, పేరు సూచిస్తున్నట్లు, మంచితనాన్ని ఆదర్శంగా స్వీకరించిన వ్యక్తి. మంచి వారి యెడల మంచిగా ఉండటమే కాకుండా, ''చెడ్డవారి యెడల కూడా మంచిగా ఉండుటకు ప్రయత్నం చేస్తే, దయాపూర్ణుడైన భగవంతుడు సృజించిన ఈ లోకము మరింత యింపుగా కనబడుతుంది. మంచిలోనూ చెడ్డ వుంటుంది, చెడ్డలోనూ మంచి వుంటుంది'' అని చెప్పే సౌజన్యారావే వేశ్యను చూడరాదు, వేశ్యతో మాటాడరాదు అనే విషయానికి బద్ధుడు. వేశ్యలను పెళ్ళి చేసుకొమ్మని చెప్పే సౌజన్యారావు వంటి సంస్కర్తలు వారికి మంచి వరుళ్లు ఎలా వస్తారనే విషయం ఆలోచించారా? ఈ రంగంలో సౌజన్యారావు నియమాలు ఎలా ఆయన మంచితనానికి అవరోధాలో మధురవాణి విడమర్చి చూపుతుంది. ముద్దును ఫీజుగా అడిగి, లుబ్ధావధాన్లకి విముక్తి కలిగించే రహస్యాలు చెప్పి, ముద్దు పెట్టుకోబోయిన సౌజన్యారావును వారించి ఆయన వ్రతాన్ని నిలబెట్టిన మధురవాణిని

మంచితనానికి పరాకాష్ఠగా గురజాడ చిత్రించారు. ఇక్కడ మంచితనమే భగవత్స్వరూపమని చెబుతూ 'భగవద్గీత'ను సౌజన్యారావు మధురవాణికి బహూకరించడం గమనిస్తే గురజాడ వ్యక్తిగత విశ్వాసం ప్రకటితమైన ఘట్టంగా తోస్తుంది. పోతే, సౌజన్యారావు మంచితనానికి జీవిత యథార్థంతో సంబంధం విస్మృతం చెయ్యడంతో ఈ ఘట్టంలో ఆయన మంచితనం 'స్వేచ్ఛ'ను పొందినట్లే అయింది. సౌజన్యారావు గిరీశానికి చేసిన బోధలో స్వేచ్ఛను బాధ్యతగానూ మంచితనాన్ని నిబద్ధతగానూ రూపొందించుకొమ్మన్న ఆదేశం వుంది. ఈ రంగం మొదట్లో మధురవాణిని గుర్తించిన గిరీశం ఆమె తన గుట్టు రట్టు చేస్తుందన్న భయంతో, ఆమెను అవతలికి తీసుకువెళ్లి ప్రాధేయ పడడానికి యత్నించి, విఫలుడై, నిష్క్రమిస్తూ: ''అయితే దాసోహం టుది అన్నోన్'' అంటాడు. ''అన్నోన్ పర్సన్'' అని పలికించలేదు గురజాడ. హాస్యమే ఆయుధంగా, తెలివితో ఎన్నో సన్నివేశాల్లో యుక్తిగా బయటపడిన గిరీశం ఈ సన్నివేశంలో తన స్వప్రయత్నమేమీ లేదని, మధురవాణి మంచితనం మీదా, తన అదృష్టం మీదా విజయం ఆధారపడి వుందనీ ''దాసోహం టు ది అన్నోన్'' అంటాడు. గిరీశం అజ్ఞాత శక్తియైన భగవంతుణ్ణి ఆశ్రయించిన ధ్వని కల్పించారు గురజాడ యిక్కడ.

వ్యక్తిస్వేచ్ఛ, సామాజికుడుగా వ్యక్తి యొక్క మంచితనం ఈ రెండూ వేరు కావనీ, ఒకదాన్ని ఆశ్రయించి మరొకటి విస్తరించి జీవితాన్ని సుఖప్రదం చేస్తాయనీ ప్రధాన పాత్రల ద్వారా గురజాడ తన తాత్త్విక దృక్పథం మూల సూత్రాన్ని అభివ్యక్తం చేశారు.

పోతే మిగతా పాత్రల ద్వారా గురజాడ చేసిన జీవిత చిత్రణలో ప్రాధాన్యం వహించేవి, నాటకం పేరుకు తగ్గట్టుగానే, కన్య - శుల్కం. పురుషార్థాల్లో అర్థకామాలు చాల మంది వ్యక్తుల జీవితాల్లో ప్రధానంగా చోదకత్వం వహిస్తాయి. అటు ధర్మము, యిటు మోక్షము వారి నాకర్షింపవు. అటువంటి పాత్రల్లో ముఖ్యంగా రామప్పంతుల్ని చిత్రించడంలో అసాధారణ ప్రజ్ఞ చూపిన గురజాడ వారు, 5 అంకం 5 రంగంలో అతణ్ణి అడకత్తెరలో పోక చెక్కవంటి పరిస్థితిలో చూపిస్తారు. మధురవాణి రామప్పంతులింట్లో వుంటూ తన కంటె లేకుండా యింట్లోకి అతణ్ణి రావద్దంటుంది. మీనాక్షి మరో వైపు తనని వివాహం చేసుకొమ్మని వెంటపడుతుంది. గత్యంతరం లేక 'రెంద్రోజులు పైకి ఉడాయిద్దా'మనుకుని చెరువుగట్టు వైపు వెడతాడు. ''ఇల్లు ఇల్లనియేవు, ఇల్లు నాదనియేవు, నీ యిల్లు ఎక్కడే చిలుకా?'' అనే పాట వినిపిస్తుంది. ''కర్రలే చుట్టాలు, కట్టెలే బంధువులు, కన్నతల్లెవ్వరే చిలుకా?'' రామప్పంతులు అనుకుంటాడు - ''ఒక్క అప్ప వుంది, అది ఎప్పుడూ నా గుమ్మంలో అడుగు పెట్టలేదు. ఇప్పుడు యింటికి యజమాని ఎవరూ? తలుపవతల సాని లంజా, తలుపివతల సంసారి వెధవ లంజానూ. ఇద్దరూ కలిసి యిల్లు చేరకుండా నన్ను తగుల్తున్నారు''. తన జీవితసత్యం తన్ను తాకిన క్షణంలో తన ఒంటరితనాన్ని గుర్తించిన వేళలోనూ, రామప్పంతుల్లో మార్పు రాదు!

రామప్పంతులికి భిన్నంగా లుబ్ధుడైన లుబ్ధావధాన్లు పెళ్లి జరిగిన మరుక్షణమే తన అవచేతనలోని భయాలకు లోనై నరకాన్ని అనుభవిస్తాడు. పశ్చాత్తాప పడతాడు. పిరికివాడూ, లుబ్ధుడూ, రామప్పంతుల్లాంటి వాళ్ల చేతుల్లో కీలుబొమ్మా, అతనికీ కన్య మీదా శుల్కం మీదా ప్రలోభం వుంది గాని, జీవితాన్ని అనుభవించే శక్తి మాత్రం లేదు! అతణ్ణి సౌజన్యారావు ఆదుకోవడం ద్వారా రామప్పంతులు గుప్పిట్లో నుంచి బయటపడతాడు. అగ్నిహోత్రావధా

ష్టుకి ధన వ్యామోహం తప్ప మరో విషయం తెలీదు. అహంకారము, ఆలోచనారాహిత్యం అతణ్ణి ఉన్న సొమ్ము పోగొట్టుకొనేలా చేస్తాయి. సౌజన్యారావు మంచి మాటలు చెవికెక్కవు. తెలివీ, విద్వత్తూ కలిగి, సోదరి కుటుంబానికి మేలు చెయ్యడానికి వ్యూహం పన్నిన కరటక శాస్త్రి సత్యాన్ని చెప్పడానికి వెనుదీయడం, తన స్వార్థానికి మధురవాణిని కలెక్టరు దగ్గరకు వెళ్లమని కోరడం, అసహ్యాన్ని కలిగిస్తాయి.

నాటకంలో అంతర్నాటకమైన లుబ్ధావధాన్ల పెండ్లి, మధురవాణి కంటె ద్వారా పెద్ద చిక్కుముడిగా తయారైనప్పుడు, సత్యాన్ని బయటపెట్టి, నిర్దోషులను కాపాడే శక్తి కోర్టులకు, పోలీసులకు, న్యాయవాదులకూ లేదంటూ, న్యాయ వ్యవస్థని విమర్శించి చిత్రించడం ఈ నాటకంలో ప్రాధాన్యం వహించింది. కోర్టులో సత్య నిరూపణం సాక్షుల మీద ఆధారపడుతుం దంటే, పోలీసు హెడ్ నమ్ముకున్న సాక్షులందరూ ఒకరి తర్వాత ఒకరు జారుకుంటారు. మధురవాణి మంచితనం, పూనిక, సాహసం సత్యాన్ని బయలుపరచి అమాయకుడైన లుబ్ధుణ్ణి రక్షిస్తుంది. సత్యం వస్తునిష్ఠం కాదు, వాద ప్రతివాదాల మీద తేలీదీ కాదు! వ్యావహారిక సత్యం కూడా వ్యక్తి నిష్ఠమేనన్న సూచన వుంది యిక్కడ.

గురజాడ వారు సమకాలీన మత ధోరణుల మీద తన అభిప్రాయాల్ని, నాటకానికి అక్కర లేకపోయినా, వ్యక్తం చేశారు. సిద్ధాంతి, పూజారి గవరయ్య, అసిరిగాడు, బైరాగి పాత్రల ద్వారా మూఢ నమ్మకాల ప్రాభవాన్ని చిత్రించారు. అంతకంటె ముఖ్యమైనది 5 అంకం 4 రంగంలో సాతాని మనవాళ్లయ్యకు, జంగం వీరేశకూ జరిగిన సంవాదంలో మనవాళ్లయ్య 'ఆకాశము శూన్యము, అంటే ఏమీ లేదన్న మాట' అంటే వీరేశ అంటాడు: ''మన్నంటే మిన్నుండదా? ఆకాశం బొక్కడ్డది అంటారు గదా, ఆకాశం లేకపోతే బొక్కడ్డమెలాగ?'' దీన్ని మునసబు ఆమోదిస్తాడు. ''బ్రహ్మం ఉన్నట్లా లేనట్లా?'' దుకాణదారు సమన్వయం చెబుతాడు: ''దేహం గాజుకుప్పె; దేహంలో వుండేది పరమాత్మ; గాజు కుప్పెలో వుండేది అన్నసారం. ఈ అన్నసారం దేహంలో పడితేగాని పరమాత్మ ప్రజ్వలించదు.'' మన్నుకీ మిన్నుకీ గల సంబంధాన్ని గూర్చిన చర్చ ఈ సమన్వయంతో ముగిసింది. మన్ను లేనిది మిన్ను లేదు! మట్టి నుంచి వచ్చే అన్నసారం మనిషికి ఆధారం, మనిషి అనుభూతి భగవంతుడు. భగవంతుడు శూన్యం కాదు. మనషి మంచితనమే భగవంతుడు. ఇదే చివరి రంగంలో సౌజన్యారావు మధురవాణికిచ్చిన సందేశం. ''మనిషి చేసిన దేవుళ్లారా'' అన్నారు గురజాడ. గురజాడ మనిషికే ప్రాధాన్య మిచ్చిన మానవతావాది. మతం మానవుని సృష్టి. అందుకే మతసహనం అవశ్యం అన్నారు గురజాడ.

''మంచి చెడ్డలు మనుజులందున, ఎంచి చూడగ రెండె కులములు, మంచియన్నది మాలయైతే మాలనే అగుదున్'' అంటాడు లవణరాజు, ''లవణరాజు కల''లో. ''ఇహము లోపలి నుంచి అంతయు, యిమిడి యున్నది దీని ఆత్మను, ముక్తి కాంతై తుదకు నీకిది ముందుగతి చూపున్'' అంటూ మాలెతను కన్యాదానం చేస్తాడు ఆమె తండ్రి లవణరాజుకు. ఆమెతో గడిపిన జీవితం, పూర్వజన్మ స్మృతి, కలగా వస్తుంది. అదంతా మాయ అంటారు శాస్త్రజ్ఞులు. లవణుడు వారిని విమర్శిస్తాడు: ''కలగవలదట, కల్ల యిదియట! కలిగినది లేదన్నయంతనె తొలగునట వేదల్! పుస్తకంబులలోని మాటలు విస్తరించుచు, ననుభవమ్ముల తత్త్వమెరుగక, శుకము లగుదురు వొట్టి శాస్త్రజ్ఞుల్! ఎప్పటికి అనుభూతమెద్దియొ, అప్పటికి అది నిక్కువంబే, ఎప్పుడో లోకంబు కల్లగునసుట యిపుడెట్లో?'' సృష్టి మాయ

కాదు, అనుభవ పూర్వకమైన సత్యం అని గురజాడ నిశ్చితాభిప్రాయం. లవణరాజు పూర్వ జన్మ స్మృతితో మాలెత అయిన భార్యను తలచుకొని ఆవేదన చెందుతుండగా, సింధు దేశాధిపతి తన కొమార్తెను లవణరాజుకు భార్యగా పంపిస్తాడు. ఆమె పూర్వజన్మలోని తన భార్యగా గుర్తించి, పునస్సమాగమంతో లవణరాజు సంతోషిస్తాడు. గురజాడకు జన్మ పరంపరలో, పూర్వ జన్మానుబంధాలలో విశ్వాసం ఉన్నట్లే తోస్తుంది! (''అంతమున మతి యెట్లుండునో అట్టి గతి కల్గున్. కలుగు భవములు కూడ నీతో కలసి గడపుచు ముక్తి జెందెద'' అంటాడు లవణరాజు).

''శత్రు మిత్రుల కిచ్చి నెనరులు, స్నేహవార్ధిని కొల్లగొంటిని; నాటి మిత్రులు తరల శూన్యంబైన పుడమిని నిలిచితిన్. పంజరంబున నున్న కట్లను, పగల దన్నగ లేక స్రుక్కితి; నింగి పర్వగలేని జన్మము నీరసంబని రోసితిన్'' 'లంగరెత్తుము' అనే గీతంలో జీవితాన్ని వ్యాఖ్యానిస్తూ చివరి మాటగా గురజాడవారు జీవిత పరమార్థం బంధ విముక్తి, స్వేచ్ఛ అనే పేర్కొన్నారు. అస్తిత్వవాదానికి మూల పురుషుడైన కర్కెగార్డ్ ''నాలోని నేను (self) ఎవరు?'' అని ప్రశ్నించుకుని 'స్వేచ్ఛ' అని సమాధానం చెప్పుకోగా, సార్త్రే ఆ మాటలకు చెప్పిన ఉటంకింపు: "I am obliged to will the liberty of others at the same time as my own'' అన్నాడు. స్వేచ్ఛ పరమోత్కృష్టమైన గమ్యం అయినప్పుడు వ్యక్తి యితరుల స్వేచ్ఛను గుర్తించి గౌరవించే స్థాయికి ఎదుగుతాడు!

స్వార్థంతో, ధర్మరాహిత్యంతో, దౌర్జన్యం, హింస, కామోద్రేకం, లోభ మోహాలతో మానవ జీవితం సమాజంలో దుర్భర మౌతున్న నేటి పరిస్థితుల్లో, 'కన్యాశుల్కం' నాటకం, 'There is a method in madness' అంటూ వ్యక్తి ధర్మాన్నీ, సామాజిక బాధ్యతనీ గుర్తెరగమనీ, శిథిలమైన సామాజిక ధర్మం నుంచీ మనల్ని స్వధర్మమే రక్షిస్తుందనీ, నావికులకు దీపస్తంభంలా, మార్గదర్శకత్వం వహిస్తున్నది. ఈ నాటకానికి ''ఒక మహత్తరమైన,నైతిక ప్రయోజనం వుందని'' గురజాడ వారే అంగీకరించారు. ★

---

The idea that a woman or a man can be in love with two people at the same time. Each person carries in his or her mind a unique subliminal guide to the ideal partner, a "love map," to borrow.

A term coined by sexologist John Money of Johns Hopkins University.

# సూపర్ మాన్ తత్త్వవేత్త నీషే

- బి. తిరుపతిరావు

ఆధునిక తత్త్వవేత్తలలో నీషే(NIETZSCH) ప్రముఖుడు. అతని చింతన ఆధునిక సంస్కృతి యొక్క అన్ని పార్శ్వాలని ప్రభావితం చేసింది. అస్తిత్వవాద తత్త్వవేత్తలలో కూడా నీషే ప్రముఖుడు. ఫ్రాయిడ్ కూడా రుణపడి వున్న గొప్ప మనోవైజ్ఞానికవేత్త నీషే. ఆధునిక జ్ఞాన సిద్ధాంతం (Epistemology) మీద కూడా నీషే ప్రభావం అపరిమితం. 20వ శతాబ్దపు సంస్కృతి అభివృద్ధి క్రమంలో నీషే పాత్రకు చాలా బలం వుంది. రిల్కే, స్టీఫాన్ జార్జ్, గోటే ఫ్రైడ్ బెన్, థామస్‌మాన్, హెర్మన్ హెస్, ఆంధ్రీగైడ్ , యేట్స్, బెర్నార్డ్ షాలాంటి ఆధునిక రచయిత లందరూ నీషే ప్రభావానికి లోనయ్యారు. అతని రచనలు 19వ శతాబ్దపు మత, సాంఘిక, విలువలు విచ్ఛేదం కావటాన్ని ప్రతీకాత్మకంగా వ్యక్తం చేసాయి. ఆధునిక ప్రపంచంలో తలెత్తనున్న నిహిలిజాన్ని కూడా నీషే ముందుగానే వూహించగలిగాడు.

నీషే ప్రష్యాలోని రోకెన్‌లో జన్మించాడు. తన బాల్యం అంతా మతవిశ్వాసాలు ఎక్కువగావున్న పరిసరాలలో గడిచింది. తనకి నాలుగేళ్ళ వయస్సప్పుడు నీషే తండ్రి మరణించాడు. తండ్రి మరణం తరువాత నాంబర్గ్‌లో తన బాల్యం తన తల్లి, అమ్మమ్మ, ఇద్దరు అత్తలు, ఒక చెల్లెలు మధ్య గడిచింది. వీళ్ళ మధ్య గడిపిన జీవితం నీషే ఆ తరువాత స్త్రీలపట్ల కొన్ని సందర్భాలలో ప్రతికూల భావాలు వ్యక్తం చేయటానికి కారణం అయింది. 1858-1864 మధ్య నీషే 'స్కూల్ ఫోర్టు' అనే ప్రసిద్ధి చెందిన బోర్డింగ్ స్కూల్‌లో చదివాడు. అక్కడే ఆయన సంప్రదాయ సాహిత్యంలోనూ, చరిత్రలోనూ మంచిజ్ఞానం సంపాదించాడు. కాలేజి చదువు ముగిసిన తరువాత నీషే బాన్ విశ్వవిద్యాలయంలో ప్రవేశించాడు. అక్కడ మతశాస్త్రం (Theology), ప్రాచీన భాషావిజ్ఞానశాస్త్రం (Philology) అధ్యయనం చేశాడు. ఆ తరువాత మతశాస్త్రం మీద యిష్టంలేక లిప్‌జిగ్ యూనివర్సిటీలో చేరాడు. అక్కడ ప్రముఖ భాషావిజ్ఞానవేత్త ఫెడరిక్ రిచేల్ పర్యవేక్షణలో తన అధ్యయనాన్ని కొనసాగించాడు. అక్కడే స్కోపిన్‌హర్, రిచర్డ్ వాగ్నర్‌ల రచనలతో పరిచయం అయింది. వీళ్ళిద్దరూ నీషేని చాలా గాఢంగా ప్రభావితం చేశారు.

నీషే విద్యార్థి దశలో వున్నప్పుడు సిఫిలిస్ వ్యాధికి గురయ్యాడు. ఇదే ఆ తరువాత నీషే మతిస్థిమితం లేకపోవటానికి కారణం అయిందని చెపుతారు. థామస్ మాన్ తాను రాసిన 'డాక్టర్ పాస్టస్' నవలలో నీషే పోలికల పాత్ర ఒకటి సృష్టించి, ఆ పాత్రకి కూడా సిఫిలిస్ రావటం, ఆ క్రమంలో ఆ పాత్ర పిచ్చిదై పోయినట్లు చిత్రించాడు. ఈ పోలికలన్నీ నీషే జీవితానికి అద్దం పట్టాయాని విమర్శకులు నమ్మారు.

యూనివర్శిటీ చదువు అయిపోయిన తరువాత నీషే 1867-68 మధ్య కొంతకాలం మిలిటరీలో పనిచేశాడు. ఆ తరువాత బాసెల్ (Basel) యూనివర్సిటీ పీఠానికి నీషేని గురువు రిచేల్ రికమండ్ చేశాడు. అందుకు కావలసిన సిద్ధాంత వ్యాసాన్ని రాసి డాక్టరేట్ పొందకుండానే ఇరవై నాలుగేళ్ల వయస్సులో నీషే యూనివర్సిటీలో అసోసియేట్ ప్రొఫెసర్‌గా నియమించబడ్డాడు.

యూనివర్సిటీలో వున్నప్పుడు నీషే వాగ్నర్‌ని అప్పుడప్పుడు కలుస్తూ వుండే వాడు, ఇద్దరూ మంచి మిత్రులయ్యారు. నీషేలో వాగ్నర్ తన కళాదృష్టికి సాధికారికంగా స్పందించగల ఒక గొప్ప స్కాలర్‌ని చూశాడు. నీషేకి వాగ్నర్ మీద విపరీతమైన యిష్టం. వాగ్నర్ సంగీతాన్ని ప్రాచీన గ్రీకు

విషాద నాటకాల పునఃసృష్టిగా నీషే భావించాడు. వాగ్నర్‌తో మిత్రత్వం వలననే నీషే తన 'THE BIRTH OF TRAGEDY' అనే గ్రంథాన్ని రాయగలిగాడు.

నీషే తన జీవితాంతం వరకు అనేక జబ్బులతో బాధపడ్డాడు. విపరీతమయిన శిరోభారం, గాస్ట్రిక్ పెయిన్స్, పైయోరియా, కళ్ళు మసక తనని నిరంతరం వెంటాడి వుండేవి. 1879 నాటికి నీషే అనారోగ్యం తీవ్ర స్థాయికి చేరుకుని తనని యూనివర్సిటీ వుద్యోగం నుండి వైదొలగేటట్లు చేసింది. అయినా కూడా నీషే రాయటం, చదవటం మానలేదు. 1870లలో 'HUMAN, ALL TOO HUMAN', 'THE DAWN OF DAY', 'THE JOYFUL WISDOM' అనే మూడు గ్రంథాలు రాశాడు. ఈ మూడు గ్రంథాలలో కూడా నీషే దృష్టి కళా, సౌందర్య శాస్త్రాల నుండి సైన్సు వైపు, ఏ విధమయిన నమ్మకాలు, చరిత్ర సంకెళ్ళు లేని స్వేచ్ఛా ఆత్మ (Free Spirit) వైపు మళ్ళటం చూస్తాం. ఆ తరువాత నీషేకి విపరీతమయిన పేరు ప్రఖ్యాతులు తీసుకువచ్చిన గ్రంథ రచన సాగింది. అవి 'THUS SPAKE ZARATHUSTRA' - ఈ గ్రంథంలోనే నీషే 'విల్ టు పవర్', 'సూపర్ మాన్' భావనలు ప్రవేశ పెట్టాడు. ఈ భావనలు మరింత విపులంగా చర్చించే క్రమంలో 'BEYOND GOOD AND EVIL', 'ON THE GENEALOGY OF MORALS', అనే గ్రంథాలు వెలువరించాడు. 1888లో తన ఆరోగ్యం కొంత మెరుగు పడే క్రమంలో తన చివరి రచనలు చేశాడు. వీటిల్లో ప్రముఖమైనవి 'THE TWILIGHT OF IDOLS', 'THE ANTI CHRIST' అనే రెండు గ్రంథాలు. రెండు రచనలలోనూ క్రిష్టియానిటి మీద దాడి చేస్తూ, తన గొప్పతనాన్ని, వీరత్వం (heroism) యొక్క ప్రాముఖ్యాన్ని చాటాడు. 1889 జనవరిలో ఒక రోజు ఇటలీలో టూరిన్ నగరంలో ఒక వీథిలో హఠాత్తుగా కుప్పకూలిపోయాడు. క్రమంగా ఆరోగ్యం క్షీణించటం మొదలయింది. మానసికంగా, శారీరకంగా ఎందుకూ పనికిరాని దశకి చేరుకున్నాడు. ఆ స్థితిలోనే పదకొండు సంవత్సరాలు జీవించి 1900వ సంవత్సరంలో వైమర్‌లో మరణించాడు.

చాలా మంది విమర్శకులు నీషే రచనల్ని మూడు దశలుగా విభజించారు. మొదటి దశ 1872 నుండి 1876 వరకు, రెండవ దశ 1878-1882 వరకు, మూడవ దశ 1883 నుండి 1889 వరకు.

నీషే మొదటి దశలోని 'THE BIRTH OF TRAGEDY' లో సోక్రటీస్ హేతుబద్ధ ఆలోచనలు ప్రారంభమయిన క్రమంలో క్షీణించిన గ్రీకు సంస్కృతిని గూర్చి నీషే చర్చించాడు. సోక్రటీస్‌కి ముందు గ్రీకు సంస్కృతిలో రెండు ధోరణులు వున్నాయి. అవి ఒకటి అపోలోనియన్ (APOLLONIAN), రెండు డైనిషియన్ (DIONYSIAN). అపోలోనియన్ ధోరణి సంయమనం, సమతుల్యం, హద్దు కలిగి వుంది. అది ముఖ్యంగా గ్రీకు శిల్పంలోనూ, వాస్తు శాస్త్రంలోనూ వ్యక్తీకరించబడ్డది. డైనిషియన్ ధోరణి అన్ని నియమాల్ని, విలువల్ని తిరస్కరించి ఆటవికంగా జరుపుకున్న మద్యపాన మహోత్సవాల్లోనూ, ఆ వుత్సవాల్లోని సంగీతంలోనూ వ్యక్తీకరించబడ్డది అని నీషే అభిప్రాయం. గ్రీకు సంస్కృతి గురించి తన కాలంలో అమలులో వున్న అభిప్రాయాల్ని నీషే సవాలు చేశాడు. ప్రాచీన గ్రీకు విషాదాంత నాటకం అపోలోనియన్-డైనీషియన్ ధోరణుల సమ్మేళనంగా నీషే ప్రకటించాడు. అపోలోనియన్ ధోరణి నటుల్ని వాచకా (TEXT)న్ని ప్రతిబింబిస్తే డైనిషియన్ ధోరణి కోరస్‌ని, సంగీతాన్ని ప్రతిబింబించింది. ప్రముఖంగా గ్రీకు నాటకం ప్రారంభదశలో ప్రకృతి బీభత్సాలముందు, చరిత్ర ఘోరాలముందు మనిషి జీవితాన్ని ప్రదర్శించింది.

సోక్రటిస్ తరువాత మార్మికమైన సత్యాని (MYSTICAL TRUTH) కంటే హేతుబద్ధతకి తత్వవేత్తల్లో ప్రాముఖ్యం పెరిగి గ్రీకు సంస్కృతి క్షీణించటం మొదలయిందని నీషే అభిప్రాయం. ఒక దశలో

డైనిషియన్ ధోరణి అణచివేయబడి అపోలోనియన్ ధోరణి ముందుకు వచ్చింది. కళా, సంస్కృతులలో రూపసౌందర్యానికి (beauty of form) ప్రాముఖ్యం పెరిగింది. ఈ సంస్కృతి క్షీణతని నీషే ఆ తరువాత జర్మనీ నేపథ్యంగా 'THOUGHTS OUT OF SEASON' అనే గ్రంథంలో చర్చించాడు. 1980లో జర్మన్ ప్రజలు బాహ్యరూపాలకి, అనుభవవాద (EMPIRICISM) ఆకర్షణకి లోనవుతున్నప్పుడు నీషే వాటిని ఈ గ్రంథంలో ఖండించాడు.

'HUMAN; ALL TOO HUMAN'తో మొదలయ్యే రెండవ దశలో వోల్టైర్‌ని, సోక్రటిస్‌ని అభిమానిస్తూ స్కోపెన్‌హార్‌ని, వాగ్నర్‌ని తిరస్కరించాడు. కళని, అధిభౌతిక (Metaphysics) శాస్త్రాల్ని తిరస్కరిస్తూ సైన్స్‌ను, స్వేచ్ఛాయుత ఆలోచనని (FREE THINKING)ని ఆహ్వానించాడు. ఈ దశలో రాసిన అన్ని గ్రంథాలు 'HUMAN; ALL TOO HUMAN; THE DAWN OF DAY'; THE JOYFUL WISDOM; ప్రపంచపు అర్థరహితపు స్థితిని, క్రిష్టియానిటీనీ, దిగజారిన మతాల్ని ఖండించటం కనిపిస్తుంది. ఏ విధమయిన స్వేచ్ఛాయుత నిర్ణయంలేక, కేవలం భయంతోనూ, వాంఛతోనూ జీవిస్తున్న మానవుణ్ణి విశ్లేషించాడు. 'Will to Power' లో బానిస, బానిస యజమానులు నీతుల మధ్య వ్యత్యాసం లాంటి విషయాలు చర్చించాడు. ఇక్కడ శక్తి, (Power) అంటే నీషే దృష్టిలో వ్యక్తిత్వానికి శైలిని (style) ఇచ్చే సామర్థ్యం. బానిస యజమాని అనే భావన కోర్కెలోంచి, జీవించాలి అనే దృఢనిశ్చయంలోంచి జనించింది. బానిస అనే భావం భయంలోంచి పుట్టిందని నీషే అభిప్రాయం. ఈ దశలో చేసిన రచనలు నీషేని స్కోపెన్‌హార్, వాగ్నర్‌ల ప్రభావం నుండి బయట పడవేశాయి.

మూడవ దశలోని గ్రంథాలలో "THUS SPAKE ZARATHUSTRA" అనేది ప్రముఖ గ్రంథం. ఈ గ్రంథంలో నీషే జరాస్త్రా అనే ప్రవక్త ద్వారా అన్ని జీవుల సారం 'Will to power' అని తేల్చిచెప్పాడు. ఇక్కడ నీషే నమ్మకం ప్రతిజీవి తానున్న స్థితి లోంచి, తన మందకొడితనం లోంచి మరింత వున్నతమైన, శక్తి వంతమైన స్థితికి చేరుకోవటానికి ప్రయత్నిస్తుందని. ఈ విషయంలో శక్తి (Power) ప్రముఖ పాత్ర నిర్వర్తిస్తుంది. ఏ జీవి కూడా తన అంతిమ లక్ష్యానికి చేరుకోలేదు కాని ప్రతి జీవి తానున్న స్థితిని అధిగమించాలని ప్రయత్నిస్తుంది. శక్తి (Power) అనే భావంలోంచి నీషే తన ఆదర్శజీవి (Superman)ని రూపొందించాడు.

ఈ సూపర్‌మాన్ తన శీలానికి (Character) శైలి (style) ఏర్పరుస్తాడు. ఆక్రమంలో తను సృజనాత్మక జీవి అవుతాడు. జీవితం యొక్క అర్థరాహిత్యాన్ని తెలిసిన ఈ సూపర్‌మాన్ ఏ విధమయిన ద్వేషం లేకుండా జీవితాన్ని ఆమోదిస్తాడు. ప్రపంచానికి ఇక ఎంతమాత్రం ప్రయోజనం లేదు. అది అర్థరహితం, అర్థ రహిత చర్యల పునరావృత్త క్రమం. ఈ బాధాకరమైన స్థితిని ఎదుర్కొనేందుకు నీషే వీరుని నీతి (Hero morality)ని ప్రతిపాదించాడు. జీవన సంఘర్షణలో నిలబడేది వీరులు మాత్రమే. కాబట్టి బలం ఒక సుగుణం. గెలిచేది బలం, నిలిచేది కూడా బలమే. అందువల్ల అది మంచి అవుతుంది. ఓడిపోయేది, అంతరించిపోయేది చెడు అని నీషే సూత్రీకరించాడు. నీషే ఆ తరువాత రాసిన గ్రందాలలో ఒక్క 'ECCE HOMO'లో తప్ప మిగతా అన్నింటిలో పై భావాల విపులీకరణ, క్రిష్టియానిటీకి ప్రతివాదాన్ని (antithesis) ముందుకు తీసుకురావటం కన్పిస్తాయి.

నీషే రచనలలో 'ECCE HOMO' చాలా వివాదాస్పదమైన గ్రంథం. అందులో కొన్ని అధ్యాయాలు 'నేనెందుకు తెలివైన వాణ్ణి', నేనెందుకు అంత గొప్ప గ్రంథాలు రాస్తాను', అనే శీర్షికలు కలిగివున్నవి. చాలామంది ఈ గ్రంథాన్ని నీషే రచనలలో ఏ మాత్రం ప్రాముఖ్యం లేనిదిగా కొట్టివేశారు. నీషే

ఆత్మోన్మాదంలో ఆ గ్రంథం రాశాడని ప్రకటించారు. ఏమయినా నీషే తాత్విక అభివృద్ధి క్రమాన్ని అర్థం చేసుకోవటానికి ఈ గ్రంథం వుపయోగపడుతుంది.

నీషే చివరి రచనల్లో ఇంకో ప్రముఖ గ్రంథం 'THE WILL TO POWER'. నీషే మరణానంతరం ప్రచురింపబడింది. నిజానికి ఇది 1884 నుండి 1888 వరకు నీషే తయారు చేసుకున్న నోట్సు. ఆ నోట్సుని నీషే సోదరి ఒక క్రమంలో పెట్టి ప్రచురించింది. ఈ గ్రంథం మతం, నీతి, జ్ఞాన శాస్త్రం, కళ మొదలయిన విషయాల గురించి నీషే భావాలు, అభిప్రాయాలు తెలుసుకోవటానికి వుపకరిస్తుంది.

నీషే మీద వచ్చిన పుస్తకాల్లో, విమర్శల్లో అభిప్రాయభేదాలు చాలా ఎక్కువ కన్పిస్తాయి. ఇవి నీషే రచనలంత క్లిష్టంగానూ, కొన్ని సందర్భాల్లో అస్పష్టంగానూ కన్పిస్తాయి. కొంతమంది విమర్శకుల దృష్టిలోనయితే నీషే మానసిక రోగి. అతని రచనలు రోగగ్రస్తమయిన అతని మెదడులోంచి పుట్టాయని నిందించారు. అయితే జార్జిబ్రాండ్స్, రుడాల్ఫ్ స్టెయినర్ మాత్రం నీషే రచనల ప్రాముఖ్యాన్ని గూర్చి బాగా ప్రచారం చేశారు. యూరప్ సాంస్కృతిక పతనాన్ని తెలిసి వుండటం, వ్యక్తి మనో విజ్ఞాన శాస్త్రం గూర్చిన అతని లోచూపు, నీతికి సంబంధించి, నైతిక శాస్త్రాల మీద అతను చేసిన అధ్యయనాన్ని వాళ్ళిద్దరూ ప్రశంసించారు.

బ్రాండ్స్ వుపన్యాసాలు, అతని పుస్తకాల వల్ల 1890 నాటికే నీషే ప్రసిద్ధి బాగా పెరిగింది. ఈ ప్రసిద్ధి మొదటి ప్రపంచ యుద్ధం నాటికి తారాస్థాయికి చేరుకుంది. కానీ యుద్ధం తరువాత నీషే పేరు అంతగా వినిపించలేదు. అయితే 1930వ దశకంలో జర్మనీలో నాజీపార్టీ అయిన 'నేషనల్ సోషలిస్ట్ పార్టీ' తన సైద్ధాంతిక ప్రచారం కోసం నీషే భావాల్ని వాడుకుంది. దానికి నీషే సోదరి ప్రోత్సాహం కూడా వుంది. నీషే 'Will to Power' అనే భావాన్ని నాజీలు 'మిలటరీ ఆధిపత్యం'గా ప్రచారం చేశారు. నీషే చెప్పిన 'Superman' భావనని ఆర్యన్ జాతికి వర్తింపజేసుకుని ఆర్యన్ ఆధిక్యాన్ని, ఔన్నత్యాన్ని ప్రచారం చేశారు. నాజీ భావ ప్రచారంలో నీషే యిరికించబడటం వల్ల (రెండవ ప్రపంచ యుద్ధం తరువాత) నీషే రచనలు విపరీతమయిన విమర్శలకి గురయ్యాయి. థామస్‌మాన్ లాంటి రచయితలు నీషేని సమకాలీన పరిస్థితుల నేపథ్యంలోంచి పరిశీలించటానికి ప్రయత్నించినప్పటికీ 1950, '60ల తరువాత మాత్రమే నీషేకి మళ్ళీ అంతర్జాతీయ గుర్తింపు వచ్చింది. మళ్ళీ నీషే రచనల మీద కొత్తగా వ్యాఖ్యానాలు వచ్చాయి.

గ్రీకు సంస్కృతి గురించి నీషే చేసిన సిద్ధాంతాలు, నిహిలిజం మీద ఆయన అభిప్రాయాలు, భాషలో ఆయన చేసిన ప్రయోగాలు [ఇవి తరవాత వినిర్మాణ (doconstruction) సిద్ధాంతానికి ఆధారమయ్యాయి]. మనోవైజ్ఞానిక శాస్త్ర వికాసానికి అతను చేసిన సేవ అన్నింటికీ గుర్తింపువచ్చింది. కాని నీషే ఒక క్రమబద్ధమయిన తత్త్వ శాస్త్రాన్ని రూపొందించడంలో విఫలమయ్యాడని, అతని రచనలలో జడాత్మకత (dogmatism) ఎక్కువని, శక్తి (power)కి మరీ ఎక్కువ ప్రాధాన్యత యిచ్చాడని విమర్శకులు వ్యాఖ్యానించారు. నీషే మీద ఇప్పటికే నాలుగు వేలకి పైగా గ్రంథాలు, కొన్నివేల వ్యాసాలు రాయబడ్డా, నీషేని గురించిన ఒక అవగాహనకి విమర్శకులు రావటం ఇటీవలనే ప్రారంభం అయింది. తను మరణించి తొంభై ఏళ్ళు గడిచినా అతని జీవితం పట్ల, అతని రచనల పట్ల రోజురోజుకీ ఆకర్షణ పెరగటం గమనార్హం. ★

# అభినవాంధ్ర సాహిత్యము

– కవికోకిల దువ్వూరి రామిరెడ్డి

సంఘమునందును వాఙ్మయమునందును మార్పులు అనివార్యములు. అన్యనాగరికతా సంసర్గమను బాహ్యనిమిత్తము వలన మార్పులు అలక్షితముగ తలసూపుచుండును. ఒక వాఙ్మయముయొక్క బాగోగులు, మంచిసెబ్బరలు తెలిసికొనవలయునన్న దానికన్న భిన్న సంప్రదాయము ననుసరించు మఱియొక వాఙ్మయముతోడి పరిచయము మనకుండవలయును. అద్వైతావస్థయందు తరతమజ్ఞానముండదు. మన దేశీయ వాఙ్మయములన్నియు ఏకసంప్రదాయబద్ధములయి సంస్కృతవాఙ్మయమునకు ప్రతిబింబములుగనుండినవి.

ఆంగ్లేయుల సంబంధమువలన పాశ్చాత్య నాగరికతతో మనకు పరిచయము కలిగినది. వారి వాఙ్మయము, వారి ప్రకృతివిజ్ఞానము మన దృష్టి నాకర్షించినవి. వారి పరిపాలనా పద్ధతి మనయందు స్వాతంత్ర్యేచ్ఛను పురికొల్పి జాతీయైక్యమును పెంపొందించినది. సంఘమునం దవతరించిన ఈ నూతనస్వాతంత్ర్యప్రియత్వము రాజకీయవిషయములందే కాక వివిధ సాంఘిక చర్యలయందు తలసూపినది. కట్లకు లోనయి బహిర్వ్యాప్తిని కోల్పోయిన సర్జనశక్తులు నేడు సంకుచితావరణమునుండి వెలికురికి ఆత్మోచిత కార్యకల్పనకు సిద్ధములైనవి. వాఙ్మయము సాంఘికజీవితముయొక్క ప్రతిబింబమే కావున సంఘమున చెలరేగిన ఈ సంచలనము, ఈ ఆందోళనము, ఈ స్వాతంత్ర్యేచ్ఛ దానియందు మాత్రమెట్లు ప్రకటితము కాకుండును?

ప్రబంధములలోని పచ్చిశృంగారము నేటి యభిరుచులబట్టి మొరటుగ తోచినది. అందలి శబ్దాలంకారములు, భావప్రేరకములు గాక కేవలము బుద్ధిపరిశ్రమకు వినియోగపడు తెచ్చికోలు అర్థాలంకారములు "intellectual gymnastics" అని నిరసించబడినవి. ఈ యసంతృప్తి ప్రతికూల విమర్శనముతోనే వ్యయమైపోక వాఙ్మయ నిర్మాణమునకు తోడ్పడినది. కందుకూరి వీరేశలింగం పంతులుగారు Vicar of Wakefield, Gulliver's Travels అను ఆంగ్లేయ నవలలను నమూనాగా పెట్టుకొని తెలుగునవల రచనకు మార్గదర్శకులైరి. వారు షేక్స్పియరు నాటకములను తెనిగించిరి. నాటకములు, ప్రహసనములు, వ్యాసములు, ఖండకావ్యములు, కవిజీవితములు వ్రాసి పంతులుగారు ఆంగ్లేయ వాఙ్మయములోని కొన్ని రచనావిధానములను, సంప్రదాయములను తెలుగులో వెలయించిరి.

వాఙ్మయ రచనలలో కలిగిన మార్పులతోపాటు భాషావిషయములందుకూడ కొంత సంచలనము ప్రారంభమైనది. గ్రాంథికభాష కృత్రిమమనియు సహజమైన వ్యావహారిక భాషలో వ్రాయుట ఆవశ్యకమనియు గురజాడ అప్పారావుగారు, గిడుగు రామమూర్తి పంతులుగారు తలంచి అందుకు కావలసిన మందుగుండు సామగ్రితో గ్రాంథిక భాషావాదులను ముట్టడించిరి. ఈ యుద్యమమునకు ఫలితముగ వ్యావహారిక భాషావాదములోని సహేతుకత్వము ఇప్పుడు అందరును అంగీకరింపక తప్పినది కాదు.

ప్రపంచవాఙ్మయములనెల్ల జీర్ణించుకొని తన శరీరమునకు కావలసిన నెత్తురు కండలుగ మార్చుకొనుటచేతనే ఆంగ్లేయవాఙ్మయము నేడు అపరిమితముగ వృద్ధి చెందుచున్నది. విదేశవాఙ్మయసంబంధము నూత్నసృష్టికి ప్రతిబంధకము కాదు. ఒకవేళ అపూర్వసృష్టి

ప్రేరకము కావచ్చును. ఇందుకు ఆంధ్రదేశమున సుమారు ముప్పదిసంవత్సరములనుండి ప్రబలుచున్న అభినవ కవితోద్యమమె తగిన తార్కాణ. ఆంధ్రకవుల ప్రతిభానర్తకికి నూత్న నాట్యరంగముల నేర్పఱచిన తప్పేమి?

అప్పారావుగారి ముత్యాలసరములతో అభినవ కవితోద్యమము ప్రారంభమయినది. సంక్షుబ్ధ సాగర కల్లోలములలో గాలి వీచినట్లెల్ల కొట్టుకొనిపోవుచున్న అభినవకవితా నావకు కట్టమంచి రామలింగారెడ్డిగారు కర్ణధారులై నిలిచిరి. వారు రచించిన కవిత్వ తత్త్వవిచారమను విమర్శనగ్రంథము ఈ నవీనోద్యమమునకు మార్గదర్శకమైనది. ఈ నవయుగ కవితా ప్రభాతముయొక్క ప్రథమరోచులు రాయప్రోలు సుబ్బారావుగారి కుటీర గవాక్షములో ప్రసరించి ఆయనను ప్రబోధించినవి. సుబ్బారావుగారు అంతకు పూర్వమే కవిత్వమల్లుచుం డిరి. ఆయన రచించిన 'లలిత'యను ప్రథమకావ్యము శబ్దాలంకారయుతమై పూర్వప్రబంధ శైలిని తలపించుచున్నను అందే భావకవితా పరిణామము యొక్క సూచనలు కూడ పొడగట్టుచున్నవి. ఆకాలమున నెల్లరకు పూర్వప్రబంధములే పాఠ్యగ్రంథములు. అభినవకవి తకు మానాలేదు. ప్రతికవియు సొంతమానాలు సృజించుకొనవలసియుండెను. ఒక సంప్రదా యము కరుడుకట్టిన వెనుక వ్రాయువారి కంతకష్టముండదు. పిఠాపురమున సుబ్బారావుగారు స్థాపించిన అభినవకవితాగ్రంథమండలిని (లేక గ్రంథమాలయో నాకు జ్ఞప్తిలేదు) గుఱించిన యొక కరపత్రమును పూర్వమొకప్పుడు సి.వి. కృష్ణయ్యగారియొద్ద నేను చూచితిని. ఆంగ్లేయ సాహిత్యములోని పేరిన తేనెగడ్డలను అభినవాంధ్ర కావ్యములలోనికి తెచ్చుట ఆగ్రంథమండలి యుద్దేశములలో నొకటియని అందు వ్రాయబడియుండినది. ప్రథమమున సుబ్బారావుగారి యుద్దేశమెట్లుండినను తరువాత వారు రచించిన కావ్యములు స్వతంత్రసృష్టు లనియే చెప్పవలయును. ఆయన వెనువెంటనే యామార్గ మవలంబించినవారు అబ్బూరి రామకృష్ణారావుగారు. 1915,1916 మొదలు పింగళి లక్ష్మీకాంతం, వెంకటేశ్వరరావుగార్లు, విశ్వనాథ సత్యనారాయణగారు, వెంకట పార్వతీశ్వరకవులు, శివ శంకరశాస్త్రిగారు, కృష్ణశాస్త్రి గారు మఱియింక కొందఱు ఈ నవీనమార్గము నవలంబించిరి. తరువాత క్రమక్రమముగ ఇప్పుడు వ్రాయుచున్న కవులందఱు కొద్దిగనో గొప్పగనో స్వతంత్రముగనే రచించు చున్నారు. వీరందఱు ఏకమార్గావలంబకులయ్యును వ్యక్తిగత శిల్పపరిపాకము ననుసరించి రచనలలో తారతమ్యము గోచరించును.

ఈ అభినవ కవితోద్యమ ఫలితముగ కొంత పునరుద్ధరణము, కొంత నూతనసృష్టి కొనసాగినది. ''ద్విపదకావ్యంబు ముదిలంజ...'' అని తిరస్కరింపబడిన ద్విపదలు, పల్లెపద ములు, పునర్గ్రహణ యోగ్యములైనవి. ఖండకావ్యములు, గేయములు, నవలలు, నాటకములు, ఏకాంకనాటికలు, ఉపకథలు, వ్యాసములు పుట్టినవి. ఇవియన్నియు తెలుగువాణికి నూత్నా లంకారములె. ఈ యిరువదియైదు సంవత్సరములనుండి పుట్టిన వాఙ్మయము విమర్శించు టకు తగినంత విరివిగానున్నది. ఏ సమర్థుడైనను నిష్పక్షపాతబుద్ధితో ఈ వాఙ్మయమును విమర్శించిన యెడల చాల ఉపయోగకరముగ నుండును.

అభినవకవిత్వమును గుఱించి యిప్పుడిప్పుడే కొన్ని యాక్షేపములు, ప్రత్యుత్తరములు బయలుదేరినవి. కాని, ఆక్షేపములవలెనే ప్రత్యుత్తరములుకూడ మూకఉమ్మడిగ నున్నవి. ఈకాలమున వ్రాయబడునదంతయు చెత్తయని తృణీకరించుట యెంత సమంజసమో ఈనాటి రచనలన్నియు మహోత్కృష్టములని ప్రశంసించుటకూడ నంత యవిచార

మూలకమే. బాగోగులు ఒక వర్తమానకాలమునకే సంబంధించినవి కావు. చెత్త వ్రాసిన వారు పూర్వము కూడ కలరు. అయితే ఆ చెత్తకును మనకును నూరులకొలది సంవత్సరముల అంతరమున్నది కావున, ఆ చెత్తయంతయు క్రుళ్ళి కాలప్రవాహమున కొట్టుకొనిపోయి అంతస్సారముగల యే కొన్నికావ్యములో నిలిచినవి. ఎచ్చటనో దాగియుండిన చెత్తలు పురాతనము అన్నంతమాత్రమునే అచ్చొత్తింపబడినవి యిప్పటికిని మనకు దొరకుచునే యున్నవి. ఈకాలమున వ్రాయబడునదంతయు బ్రతికియుండునని యెవరు చెప్పగలరు? ఈ సంశయము కాలమే తీర్పగలదు. ప్రతిభావంతులగు కవులు ఏకాలమందైన నుందురు. అయితే వారిమార్గములు భిన్నములుగ నుండవచ్చును.

పోలవరపు రామబ్రహ్మముగారు 'ప్రజామిత్ర'లో ఆధునిక కవిత్వమును విమర్శించిరి. వారి విమర్శలో కొంత సత్యమున్నది. కొంత తొందరపాటు, కొంత పొరపాటు కూడ ఉన్నది. వీరికి సుబ్బరాయుడుగారు మున్నగు పెద్దకవులతో ఏలాటి తగాయిదా లేదు. రాయప్రోలు సుబ్బారావు, అబ్బూరి రామకృష్ణారావుగార్ల కావ్యములతో గూడ వీరి కేలాంటి యిబ్బంది లేదు. కాని యితరకవులు రచించిన కావ్యములన్నియు చెత్తలని వీరభిప్రాయపడిరి. సుబ్బారావు, రామకృష్ణారావుగార్ల కావ్యములను మెచ్చుకోగలవారు తదితరులు వ్రాసినదంతయు చెత్తయని యెట్లు తలంచిరో నాకు బోధపడుట లేదు. వారి కావ్యములలో నున్న గుణములును దోషములును తక్కినవారి కావ్యములలో గూడ నున్నవి. పింగళి లక్ష్మీకాంతం, వెంకటేశ్వరరావుగార్ల 'సౌందరనందము', విశ్వనాథ సత్యనారాయణగారి 'ఆంధ్ర ప్రశస్తి', శివ శంకరశాస్త్రి గారి 'హృదయేశ్వరి', కృష్ణశాస్త్రి గారి గీతములు, వేదుల సత్యనారాయణ శాస్త్రిగారి ఖండకావ్యములు, జాషువాగారి 'ఫిర్దౌసి', నాయని సుబ్బారావుగారి మాతృగీతములు, కొడాలి సుబ్బారావుగారి 'హంపీక్షేత్రము', బసవరాజు అప్పారావుగారి గేయములు, నండూరు సుబ్బారావుగారి యెంకిపాటలు, కుందుర్తి నరసింహారావుగారి పంపాసరస్సు (ఇదియొక కావ్యఖండము), బొడ్డు బాపిరాజుగారి 'విపంచి' యే వాఙ్మయమునకైన అలంకారప్రాయములుగ నుండగలవు. మచ్చునకుగా కొందఱి కవులను, వారికావ్యములను పేర్కొంటిని. చక్కగా కవిత్వము వ్రాయగలకవులు ఇంక నెందఱో నేడు ఆంధ్రదేశమున నున్నారు. ఈ రచనలన్నియు చెత్తలని చెప్పుటకు రామబ్రహ్మముగారు సాహసింతురా? అట్లు సాహసింతురేని వారి యభినవకవితా పరిచయము 1916 వ సంవత్సర పర్యంతమనియే మన మూహింపగలము. అట్లు గానిచో వారి సహృదయత్వమును మనము శంకింప వలసి యుండును.

రామబ్రహ్మముగారు చూపించిన కావ్యదోషములు నేటికవిత్వమున కానవచ్చుచున్నవి. దూరాన్వయము, క్లిష్టాన్వయము, అర్థము బోధపడని పదములకూర్పు, నిరర్థక పదాడంబరత్వము, భావప్రకటనము చక్కగా చేయలేని గజిబిజితనము మున్నగు కావ్యదోషములు ప్రత్యేకముగ ఆయాకవికి సంబంధించిన రచనాలోపములే కాని అవియెల్ల అభినవకవితకు లక్షణములు కావు. కవి మనస్సులోని భావము స్ఫుటముగా ప్రకటించుటకు తగినంత తీవ్రము కాకపోవుటచేతను, భాషపై కావలసినంత ప్రభుత్వము లేకపోవుటచేతను, భావోచితమైన పదమును వెదకికొన లేకపోవుటచేతను ఇట్టిదోషములు కలుగుచుండును. స్వాతంత్ర్యము చేకూరినవెంటనే సంప్రదాయములమీది ప్రమాణగౌరవము నశించును. అట్లు నశింపనిదే నూత్నసృష్టిని పురికొల్పు సాహసమలవడదు. ఒక్కొక్కప్పుడు మనము

స్వాతంత్ర్యమును దుర్వినియోగ పఱచుచుండుటయు కలదు. స్వాతంత్ర్యము దుర్వినియోగ పడునను భయముతో పారతంత్ర్య మనుభవించుట భావ్యము కాదు. తప్పులు చేయనిదే యొప్పులు నేర్చుకొనము. ఒక నూత్నసంప్రదాయము కరుడుగట్టు ప్రథమదశయందు ఇట్టి దోషము లుప్పతిల్లుచుండును. రవీంద్రనాథ టాగూరుగారు కవిత్వము వ్రాయ ప్రారంభించిన కాలముననే నూత్నసంప్రదాయముకూడ అంకురించుచుండినది. దానికి టాగూరుగారు గూడ కొంతవఱకు బాధ్యులు. ప్రథమమున వీరు వ్రాయుచుండిన బంగాళీకవిత్వము అర్థమగుటలేదని అందఱు గోలపెట్టిరి. ఇప్పుడు మన కవిత్వమున గోచరించు దోషములు అప్పుడు ఆయన కవిత్వములో కూడ దొరలినవి. దీనిని గుఱించి తన ''జీవనస్మృతి'' యందు కొంత సమర్థించిరి.

ఈ సందర్భమున అభినవకవుల కష్టములనుగూడ మనము గుర్తింపవలయును. వార్తా పత్రికలమూలమునను, వివిధ వాఙ్మయ గ్రంథ బాహుళ్యమువలనను నేడు ప్రపంచమంత టితో మనకు సంబంధమున్నది. కావున మన భావములుకూడ విరివియైనవి. మనభాష మనభావములతో పాటు వృద్ధి పొందలేదు. "New phraseology to express new ideology" అన్నట్లు, క్రొత్తభావములను, అందలి తరతమచ్ఛాయలను వెలిపుచ్చుటకు క్రొత్త రకపు పదములకూర్పు ఆవశ్యకమగును. కవియొక్క భాషాప్రభుత్వము, పదములు కూర్చు నేర్పు ఇట్టియెడ నుపకరించును.

భాష యెప్పటికిని భావములకంటె వెనుకపడియుండును. భావములు మాఱినంత సులువుగా భాష మాఱదు. అయినను కార్యకుశలుడు కొఱముట్లు లేనిలోపమును ఎట్లో పూర్తిచేసికొనును. ప్రతిభావంతులగు కవులు, గ్రంథకర్తలు జన్మించి సమకాలీన భాషను తమ కూర్పు నేర్పు చేత వివిధ భావ ప్రకటనార్థముగ నొనరింతురు. పదజాలము సంకుచితమ య్యున్నను కవి ఆవశ్యకమును బట్టి ఒక యింద్రజాలము పన్ని భాషాదారిద్ర్యమును అతిక్రమించును. పూర్వమునుండియు కవులు కావ్యములలో ఉపమాద్యలంకారములను వాడుచున్నారు. భామహునికాలమున నాలుగు అలంకారములే గుర్తింపబడినవి. కాని క్రమ క్రమముగ విమర్శకుల వృథక్కరణ శక్తివలన అలంకారములు పెక్కులయి మనము వ్రాయు ప్రతివాక్యము, సమాసము, ఏదో యొక యలంకారముక్రిందికి వచ్చునట్లైనది. కాని మొట్టమొదట ఈ యలంకారముల నుపయోగించిన కవి, అవి యలంకారములని, కవితకు మెఱుగుపెట్టుటకు వాని నుపయోగించుచున్నానను జ్ఞానముతో కాక, తాను ప్రకటించదల చిన భావతీవ్రతను మొక్కవోక స్ఫురింపజేయుటకు పడిన కడగండ్లే యీ యలంకారములని నాయుద్దేశము. తాను చెప్పదలచుకొన్న భావమునకు ఉచితమైనపదము భాషలో నుండిన ఈయుపమాద్యలంకారములకు అవసరముండదు. భాషకు సహజమైన లోపమె యీయలంకా రములకు మూలము. ఒక యుదాహరణము చూడుడు.

న ఖలు న ఖలు బాణః సన్నిపాత్యోఽ యమస్మిన్
మృదుని మృగశరీరే పుష్పరాశా వివాగ్నిః

దుష్యంతుడు ఆశ్రమ మృగమును తరుముకొని వచ్చుచుండగ కణ్వశిష్యులు చూచి దానిని రక్షింప నెంచి, ''ఓరాజా, యిది యాశ్రమ మృగము. దీనిని చంపదగ''దని చెప్పిరి. ఆశ్రమ కురంగమని బెదురుపెట్టినంతనే సార్వభౌముడు భీతిల్లి దానిని వదలునా? దుష్యంతుడు

మృగయాప్రియుడు. వేటాడుటకొఱకే వచ్చెను. జీవహింస క్షత్రియులకు క్రొత్తది కాదు. కావున వైఖానసులు ఎట్టయినను రాజహృదయమును కరుణార్ద్రము కావించి మృగమును రక్షింపవలయును. అట్టియెడ ''మృదువైన మృగశరీరమునందు బాణము ప్రయోగింప వలదు'' అని బ్రతిమాలిరి. మృదువు అనువిశేషణము బాధ నోర్చుకొనలేని కోమలత్వమును స్ఫురింపజేయును గాని, ఎంత సుకుమారమని వైఖానసుడు చెప్పిన రాజహృదయము ఆర్ద్రమగునో అంతసౌకుమార్యమును స్ఫురింజేయుట కీ విశేషణము చాలదు. కావున వైఖానసుడు ఆ భావతీవ్రతను, సాంద్రతను ఇట్లు ప్రకటించెను: రాజా, నీవు మృగముపై బాణము వేయుదువేని పూలరాశిలో అగ్గిపెట్టినట్లే! పూవులు చాల పేశలములైనవి. తాకిన కందిపోవునవి. తల నిడికోదగినవి. తన ప్రేయసి ధరియించునవి. తాను ప్రణయబహుమాన ముగ గొన్నవి., దేవుని పూజించుట కర్హమైనవి. ప్రకృతిదేవీ దరహాసములవంటివి. మనోహర ములైనవి. ఇట్టి పూలకు నగ్ని రగిల్చినట్లగునా! ఈకార్యము క్రూరము. ఘోరము. ఎంత కర్కశాత్ముడైనను ఈకార్యమొనరింపడు. ఇక సరసుడైన దుష్యంతునిమాట వేఱ చెప్పవల యునా? ఈ సాదృశ్యప్రభావమువలన ''మృదువు'' అను విశేషణము అంతకు పూర్వము స్ఫురింప జేయలేని యెన్నో భావములు ఇప్పుడు దానికి సంక్రమించినవి.

కవి గాఢమైన తన రసానుభూతిని చెక్కు చెదరనీయక పఠితలహృదయముల స్ఫురింపజే యును. భావమునకు భాష కేవలము సంజ్ఞామాత్రమె. ఒకొక్కప్పుడు మనము భావించిన దొకటి, ప్రకటించిన దొకటిగా ఏర్పడును. ఏలయన, భావముసున్నితమైనది. భాష స్థూలమైనది. కావున దీనికొక momentum కలదు. ఇందుకు ప్రతీకారముగ భావము తీవ్రతరము కానిదే భాష భావమునకు లొంగదు. కవి యుపయోగించు సంజ్ఞలు పఠితలకు కూడ తెలిసినవిగనో తెలిసికొనదగినవిగనో యుండవలయును. పదమునకు నిఘంటువు ప్రసాదించు అర్థమునకంటె వేఱుశక్తులుకూడ కలవు. ఆ శక్తులయన్నిటి పైనను కవి యాధారపడి తన భావమును స్ఫురింపజేయును. తన భావము ఇతరుల కెఱుకపడనియంత క్లిష్ట సంజ్ఞలతో ప్రకటింపబడియున్న ఆ పద్యము మూగ చెవిటి వారల సంభాషణమువలె వ్యర్థమగును. కావ్య ప్రయోజన మందు శూన్యమగుటవలన దానికి కావ్యత్వ హానికూడ సిద్ధించును. F. T. Palgrave గారు "Golden Treasury" అను ఖండకావ్య సంపుటమునకు తాను రచించిన యుపోద్ఘాతమున నిట్లు వ్రాసియున్నారు:- '...that passion, colour, and originality cannot atone for serious imperfections in clearness, unity or truth.' కావ్యమునకు ముఖ్యమైన గుణములలో భావస్ఫుటత్వ మొకటియని ఈ విమర్శకుని అభిప్రాయము.

భావములు వాచ్యములుగనె యుండవలయునా? వ్యంగ్యముగ నుండకూడదా? అని కొందఱు ప్రశ్నించవచ్చును. భావస్ఫుటత్వము వ్యంగ్యమర్యాదకు విరోధి కాదు. ప్రకరణా ర్థము గోచరించగనే తదతిరిక్తమైన వేఱొకభావము స్ఫురించవచ్చును. శ్లిష్టార్థసమన్వితములైన పద్యములను దీసికొని యవి వ్యంగ్యప్రధానములని సమర్థించుట ఇప్పుడొక యాచారమైనది. ధ్వనిప్రధానములని యెన్నబడు సంస్కృత శ్లోకములలో ప్రకరణమునకు సంబంధించిన యర్థము సులభ గ్రాహ్యముగనే యుండును.

రామబ్రహ్మముగారు బూతుకథల విమర్శించిరి. వీరికి బూతుకథలపై గలిగిన ఆగ్రహము అభినవ సాహిత్యము నంతటిపై ప్రసరించి వారి విమర్శనమునకున్న విలువను తగ్గించినది.

బూతుకథలు వెలువడుచుండుట యథార్థమే గాని అభినవ సారస్వతమంతయు ఈ బూతులు తప్ప యింకేమి లేదని చెప్పుట ఆ సాహిత్యముతోడి వీరి పరిచయ మెంతటిపాటిదో మనకు గోచరించుచున్నది. మున్నటివైనను నేటివైనను బూతులుబూతులే. నాగరాకాభిరుచి గలవారికి అట్టికథలు ఏవము పుట్టించును. అట్టి కథకులు ఏస్త్రీలను సంస్కరించుటకు (గిరీశము వలె) ప్రయత్నించుచున్నారో ఆస్త్రీల ఆత్మ గౌరవమునకే అట్టి కథలు భంగకారులుగ నున్నవి. కథలు వ్రాయువారందరు ఇట్టి బూతుకథలే వ్రాయుట లేదు. ఇట్టి కథలు ప్రచురించుటకు రెండు మూడు మాసపత్రికలె కంకణము కట్టుకొన్నవి.

''సుబోధిని'' పత్రికయందు ''నవకవులు-బూతుకవనము'' అని రామబ్రహ్మముగారు రచించిన వ్యాసము ''ప్రజామిత్ర'' లోని వ్యాసమునకన్న మఱింతతీవ్రమై బూతుకథలతో వారికిగల పరిచయమును సార్థకపఱుచుచున్నది. నవకవులెవ్వరును బూతుకవనము వ్రాయుట లేదు. వారి కవిత్వములోని శృంగారము సభ్యముగను నాజూకైన యభిరుచిగలదిగ నుండును. కవిత్వము వ్రాయువారిలో కథలు వ్రాయువారిసంఖ్య చాల తక్కువ. వారి కథలలోకూడ బూతులేదు. అందులో ఒక్కరు మాత్రము అట్టి కథలు వ్రాయుచుందురు. ఇకమీదనైనను రామబ్రహ్మముగారు విషయ వృథక్కరణమునందు కొంత పరిశ్రమ చేయుదురుగాక యనియు, అభినవకావ్య సాహిత్య పరిచయము కలిగించుకొందురు గాకయనియు నామనవి.

''ఉదయిని'' సాహిత్య పత్రిక, 1936, మే

సంపాదకుడు - కొంపెల్ల జనార్దనరావు

సేకరణ - మండవ శ్రీరామమూర్తి

# TOOTH - PEST

To get at their competitors in the marketing blitz, toothpaste manufacturers often claim that a particular brand contains fluoride and hence the best that money can buy for tooth and gum care. Municipal authorities probably taken in by this massive surge of propaganda about the germ-killing properties of fluoride (sodium fluoride to be precise), also use this chemical to destroy a wide range of harmful living organisms in potable water. But how safe is this powerful benefactor?

Not very, say scientists working in Tokyo's Nippon Dental University. In a recently published research paper, they pointed out that regular use of sodium fluoride, be it in toothpaste or drinking water can lead to the formation of tumours in those parts of the body that come in direct contact with it. According to the scientists, sodium fluoride causes tumours by changing the structure of DNA, the components of genes.

సమీక్ష:

# ప్రేమించడం ఒక కళ

**Art of Loving**
**By ERICH FROMM**

– అన్నపరెడ్డి వెంకటేశ్వర రెడ్డి

ప్రేమ ఏ ఒకదానికో కాక ప్రపంచానికంతటికి చెందుతున్నప్పుడు, మనం అర్థం చేసుకోవలసింది ప్రేమ వస్తువును బట్టి రకరకాల ప్రేమలో తేడాలు లేవని కాదు.

**(a) సోదర సదృశ ప్రేమ (Brotherly love)**

రకరకాల ప్రేమ వెనుక ఉన్న మౌలిక ప్రేమ సోదరప్రేమ. ఈ రకమైన ప్రేమ ఇతరులమీద ఆపేక్ష, గౌరవం, బాధ్యత, అవగాహనలు చూపిస్తుంది. వారి జీవితాలు వికసించాలని ఆకాంక్షిస్తుంది. ఈ రకం ప్రేమను గురించి బైబిల్ ఇలా చెప్పింది: పొరుగువాని నీవలె ప్రేమించు. మానవాళి అంతటికి సోదరప్రేమే ప్రేమ. దాని ముఖ్య లక్షణం అపవాదం (మినహాయింపు) లేకపోవడము. ప్రేమ సామర్థ్యాన్ని నేను అలవరుచుకొంటే, నా సోదరులను ప్రేమించకుండ ఉండలేను. సోదర ప్రేమలో సర్వమానవులు ఐక్యతను సాధిస్తారు, ఏకాభిప్రాయానికొస్తారు. 'మనమందరం ఒకటే' అనే అనుభవం మీద సోదరప్రేమ ఆధారపడి ఉంది. మానుష హృదయ కుహరం (human cave) అందరికీ ఒకలాగే ఉంటుంది. దీనితో పోలిస్తే, ప్రజ్ఞాపాటవాల్లో తెలివితేటల్లో, జ్ఞానంలో మనుషుల మధ్య తేడాలు చెప్పుకోదగినవి కావు. ఈ సమానత్వం అనుభవించడానికి ఉపరితలం నుంచి అంతరాంతరాలలోకి చొచ్చుకుపోవాలి. అవతలి వ్యక్తిని పైపైనే పరికిస్తే మనకు గోచరించేవి తేడాలు మాత్రమే. అతని అంతరకుహరం లోకి చొచ్చుకుపోయి చూస్తే అతనితో మనకున్న తాదాత్మ్యత, సౌభ్రాతృత్వం కనిపిస్తాయి. కేంద్రానికి కేంద్రానికి (కుహరానికి కుహరానికి) ఉన్న ఈ సంబంధిత్వం ''కేంద్రీయ సంబంధిత్వమే'' (Central relatedness) కాని పరిధి పరిధి మధ్య సంబంధం కాదు. లేదా సైమన్ వెయిల్ (Simone Weil) అందంగా చెప్పినట్లు: ''ఒకే మాటలు (ఉదా: మగడు భార్యతో అంటాడు, ''నేను నిన్ను ప్రేమిస్తున్నాను''.) చెప్పిన తీరునుబట్టి సాధారణంగా గాని, అసాధారణంగాగాని కనిపించవచ్చు. ఈ చెప్పిన తీరు మానవుని ఏ గుండెలోతుల నుంచి (నాలుకపై నుంచా హృదయంలోనుంచా) ఆ మాటలువచ్చాయో ఆ లోతుల మీద ఆధారపడి ఉంటుంది. ఒక విచిత్రమైన సాదృశ్యం వల్ల, వినేవానిలోను, అదే లోతులకు ఆ మాటలు చేరతాయి. ఈవిధంగా వినేవాడు, అతనికి విచక్షణజ్ఞానం ఉంటే, ఆ పదాల విలువ ఏమిటో విడమరచుకోగలడు''.

**IMPRINTING**

**Evolution, genetics, psychological experiences** and even **smells** can trigger romantic reactions to another person. Scientists have recently found that animals may have an innate aesthetic sense and experience attraction.

సోదరప్రేమ సమానవ్యక్తుల మధ్య ప్రేమ. కాని, నిజంగా మనం అన్ని వేళల ''సములం'' కాము; మానవులమై ఉన్నంతకాలం మరొకరి సహాయం కోరక తప్పదు. ఈరోజున నేను, రేపు నీవు. ఈ సహాయావశ్యకతకు అర్థం ఒకడు నిస్సహాయుడని, మరొకడు శక్తిమంతుడని కాదు. నిస్సహాయ స్థితి ఎల్లకాలం ఉండేదికాదు. తన కాళ్ళమీద తాను నిలబడి నడవగల స్థితి శాశ్వతమైనది, అందరికీ సామాన్యమైనది.

అయినా, నిస్సహాయుని, పేదను, కొత్తవానిని ప్రేమించటం సోదరప్రేమకు నాంది. తన రక్తమాంసాలను తాను ప్రేమించడం గొప్ప కాదు. జంతువు తన సంతానాన్ని సాకుతుంది, ప్రేమిస్తుంది. నిస్సహాయుడు యజమానిని ప్రేమిస్తాడు, ఎందుకంటే అతని జీవితం యజమానిమీద ఆధారపడి ఉంటుంది. తల్లిదండ్రులమీద ఆధారపడాలి గనుగ బిడ్డ వారిని ప్రేమిస్తాడు. ఉపయోగపడనివారిని ప్రేమించడంలో ప్రేమ విస్తృతమవుతుంది. పాత నిబంధనల గ్రంథం **(Old Testament)** మానవ ప్రేమకు కేంద్రవస్తువు పేదవాడు, కొత్తవాడు, వితంతువు, అనాథ, చివరకు జాతి శత్రువు, ఈజిప్టువాసి, ఇడోమైట్‌లని చెప్పింది. నిస్సహాయుని మీద అనుకంప చూపించడం ద్వారా మానవుడు తన సోదరుని ప్రేమించనారంభిస్తాడు. తనను తాను ప్రేమించుకోవడమే కాక, నిస్సహాయుని, బలహీనుని, అనాథను ప్రేమిస్తాడు. అనుకంపలో జ్ఞానం, తాదాత్మ్యత ఉంటాయి. ''కొత్తవాని హృదయం నీకు తెలుసు, ఎలాగంటే ఈజిప్టు గడ్డకు మీరంతా కొత్తవారే... కనుక కొత్తవారిని ప్రేమించండి'' అని పాత నిబంధనల గ్రంథం చెప్పింది.

## (b) మాతృసదృశ ప్రేమ (motherly love)

మాతృసదృశ ప్రేమ శిశువుపట్ల అతని అవసరాలపట్ల తల్లి తీసుకొన్న నిర్వ్యాజక నిర్ణయము (unconditional affirmation). తల్లి బిడ్డ జీవితం మీద తీసుకొనే నిర్ణయంలో రెండు పక్షాలుంటాయి. ఒకటి, జీవితానికి అతని పెరుగుదలకు అత్యావశ్యకమైన అపేక్ష, బాధ్యత. రెండవ పక్షం శిశుసంరక్షణ కంటె ఎంతోదూరం పోతుంది. అది బిడ్డకు జీవితేచ్ఛను (జిజీ విషను) కలిగిస్తుంది, ఒకరకమైన అనుభూతి నిస్తుంది. ఆ అనుభూతి ఇలా ఉంటుంది: జీవించి ఉండడడం ఎంత బాగుంటుంది: పసిపిల్ల వాడిగానో, పసిపిల్లగానో ఉండడం ఎంత హాయి! ఈ భూమిమీద ఉండడం ఎంత బాగుంటుంది! మాతృ సదృశ ప్రేమకున్న ఈ రెండు పక్షాలను బైబిల్ సృష్టికథ చాల బాగా చెప్పింది: దేవుడు ప్రపంచాన్ని మనిషిని సృష్టించాడు - ఇది దేవునికి ఉనికి మీద ఉన్న వట్టి అపేక్ష బాధ్యతలను సూచించే మొదటి పక్షము, కాని దేవుడు అంతటితో ఊరుకోడు. ప్రకృతిని, మనిషిని సృష్టించిన తరవాత ప్రతిరోజు దేవుడు అంటూ ఉంటాడు: ''ఎంతో బాగుంది.'' అని - ఇది రెండవ పక్షాన్ని సూచిస్తుంది. మాతృసదృశ ప్రేమ ఈ రెండవ పక్షంలో బిడ్డకు ఈ అనుభూతిని కలిగిస్తుంది:

---

**ATTRACTION**

The brain is rewed up by **phenylethylamine** (PEA) and possibly the neurochemicals **dopamine** and **norepinephrine**, all natural amphetamines. These produce feelings of euphoria and elation. This stage can last for two to three years, then starts to wane.

''పుట్టి భూమిమీద పడడం చాల బాగుంది.'' ఒట్టి జీవించాలనే కోర్కె మాత్రమే కాక, అది బిడ్డలో జీవన రాగాన్ని రేకెత్తిస్తుంది. ఇదే భావం బైబిలులో మరొకచోట ప్రతీకాత్మకంగా చెప్పబడింది. వాగ్దత్తమైన భూమి (భూమి ఎప్పుడు తల్లికి ప్రతీక) ''తేనె, పాలు ప్రవహిస్తున్నట్లుగా'' వర్ణితమైంది. పాలు మొదటి పక్షమైన ఆపేక్ష నిర్ణయాలకు ప్రతీక. జీవితం మీద తీపికి, కాంక్షకు, జీవించి వుండడంలోని సుఖానికి మాధుర్యానికి తేనె ప్రతీక. పాలివ్వగలిగిన తల్లులు చాలమంది ఉన్నారు గాని, ''తేనె'' గూడ ఇవ్వగలిగిన తల్లులు బహు కొద్దిమంది మాత్రమే. తేనెలందించడానికి తల్లి ''మంచితల్లి'' అవడమే కాక, సంతోషకరమైన వ్యక్తి అయి ఉండాలి. ఈ లక్ష్యాన్ని ఎంతోమంది సాధించలేరు. బిడ్డమీద తల్లి ప్రభావాన్ని తక్కువగా అంచనా వేయలేము. తల్లి వ్యాకులత బిడ్డకు ఎలా వ్యాపిస్తుందో ప్రేమ అంతే. రెండు పక్షాలు బిడ్డమూర్తిమత్వం (personality) మీద ముద్రలను గాఢంగానే వేస్తాయి. నిజంగా, మనం పిల్లల్లో, ఆ మాటకొస్తే పెద్దవారిలో గూడ, ఎవరికి ''పాలు'' లభించింది, ఎవరికి ''తేనె'' లభించిందీ చెప్పవచ్చు.

భ్రాతృ సదృశ ప్రేమ, కామప్రేమ, రెండు గూడ ఇద్దరు సముల మధ్య మాత్రమే ఉంటాయి. దీనితో పోలిస్తే మాతృ సదృశ ప్రేమ ఇద్దరు అసముల మధ్య ఉంటుంది. ఇందులో ఎప్పుడూ ఒకరికి సహాయం అవసరమవుతూ వుంటుంది, దానిని రెండవ వారు సమకూరుస్తూంటారు. ఈ నిస్వార్థ పరోపకార లక్షణం మూలంగానే మాతృసదృశ ప్రేమను అత్యుత్తమమైన దానిగా, అన్ని ఉద్వేగ బంధాలలోనికి పవిత్రబంధంగా పరిగణిస్తారు. మాతృ ప్రేమలో గొప్పతనం పసిపాపను సాకడంలోకాక, పెరిగి పెద్దదవుతున్న బిడ్డను ప్రేమించడంలో ఉన్నట్లు కనిపిస్తుంది. వాస్తవానికి, శిశువు తల్లిమీద పూర్తిగా ఆధారపడినంత కాలం ఎక్కువ మంది తల్లులు ప్రేమమూర్తులే అవుతారు. ఎక్కువ మంది స్త్రీలు పిల్లలు కావాలనుకొంటారు; అప్పుడే పుట్టిన బిడ్డల మీద మురిపెం చూపిస్తారు; ఆపేక్షను ఒలకబోస్తారు. శిశువు నుంచి ప్రతిఫలంగా ఒక చిరునవ్వో, బిడ్డముఖంలో సంతృప్తో తప్ప ఏమీ లభించవని తెలిసిగూడ ఇది జరుగుతుంటుంది, ఈ ప్రేమ, ఈదృక్పథం జంతువుల, స్త్రీల సహజాత నిర్మితిలో పాక్షికంగా నిక్షిప్తమై ఉన్నట్లు కనిపిస్తుంది. ఈరకం మాతృసదృశ ప్రేమలో సహజీవిత కారకం పాలు ఎంతైన, ఇతర ప్రత్యేక (మానవ) మానసిక కారణాలు వున్నాయి. శిశువును తనలో భాగంగా ఎంచినంతకాలం, ఆమె ప్రేమ ఆరాధనలు ఆమె స్వానురాగాన్ని తృప్తి పరుస్తాయి (satisfaction of her narcissism) ఈ రకమైన మాతృసదృశ ప్రేమకు మరొక ప్రేరణం ఆమె అధికార వాంఛ (wish for power) లేదా స్వాయత్త వాంఛ (wish for Possession) లో కనిపిస్తుంది. స్వాయత్త-ప్రవృత్తి గల అనుశాసించే స్త్రీకి, నిస్సహాయుడై, పూర్తిగా ఆమె ఇష్టా ఇష్టాలకు వశవర్తి అయిన బిడ్డ తృప్తినిస్తాడు.

**ATTACHMENT**

During this stage, larger amounts of **endorphins** (chemically similar to morphine) flow into the brain, leaving lovers with a sense of security, peace and calm.

ఈ ప్రేరణలు తరచు వుండేవే అయినా, అధిగమనావసరం (need for transcendence) అని మనం పిలిచే ప్రేరణ కంటె ముఖ్యమైనవి కావు. ఈ అధిగమనావసరం (పైపైకి పోవాలనే వాంఛ) మానవుని అత్యంత ప్రాథమిక అవసరాలలో ఒకటి. తనను గురించి తాను తెలుసుకోవడంలో ఆశ్రిత జీవితం పట్ల అయిష్టత చూపడంలో, డబ్బాలో నుంచి విసరబడిన పాచికగా తనను తాను అంగీకరించక పోవడంలో (ఇతరుల చేతిలో పాచిక గాక పోవడంలో) ఈ అవసరం కనిపిస్తుంది. అతడు సృష్ట వ్యక్తిగా కాక సృష్టికర్త, అంటే కర్మ గాక కర్త, కావాలనుకుంటున్నాడు, ఈ సృష్టి ద్వారా లభించే తృప్తిని రాబట్టడానికి అనేక మార్గాలున్నాయి; అందులో ఒకటి బిడ్డ మీద తల్లి ప్రేమాపేక్షలను బరపడము ఇది అతి సహజమైనది. దీనిని సాధించడం తేలిక. ఆ బిడ్డలో, తల్లి, తనను తాను ఉద్దమించుకొంటుంది. (తనను తాను దర్శించుకొంటుంది) బిడ్డ మీద ప్రేమ ఆమె జీవితానికి ఒక అర్థాన్ని, సాఫల్యాన్ని కల్పిస్తుంది. (మగవాడు పిల్లల్ని కని, ఈ అవసరాన్ని తీర్చుకోలేని అశక్తుడు, అందుకని అతడు వస్తువులను తయారుచేసి, కట్టడాలను నిర్మించి, భావాలను సృష్టించి ఈ అవసరాన్ని తీర్చుకొంటాడు. ఈ సృష్టిలో, అతడు తన్ను తాను అధిగమించి, తనను తాను దర్శిస్తాడు. పిల్లల్ని కనలేని అశక్తతను ఈవిధంగా అధిగమిస్తాడు).

కాని బిడ్డ ఎదగాలి. తల్లి గర్భం నుంచి, స్తనం నుంచి బయటపడాలి, చివరికతడు పూర్తిగా వేరే వ్యక్తిగా రూపొందాలి. మాతృ సదృశ ప్రేమ ఆంతర్యం బిడ్డ వికాసాన్ని అభిలషించడమే. దీని అర్థం బిడ్డ పూర్తిగా తన నుంచి వేరుకావాలని కోరడమే. కామ ప్రేమకు దీనికి తేడా ఇక్కడే వుంది. కామ ప్రేమలో వేరువేరుగా ఉన్న ఇద్దరు వ్యక్తులు ఒకటవుతారు. మాతృ సదృశప్రేమలో ఒకటిగా ఉన్న ఇద్దరు వ్యక్తులు వేరవుతారు. ఈ ఎడబాటును తల్లి సహించడమే కాక, ప్రోత్సహించాలి, కోరాలి. ఈ సమయంలో మాతృ సదృశప్రేమ క్లిష్ట దశను చేరుతుంది. అది నిస్వార్థంగా వుండాలి. ప్రేమించిన వాని సుఖాన్ని తప్ప దేనిని ఆశించకుండ, అన్నిటిని ఇవ్వగలగాలి? ఈ దశలోనే చాలమంది తల్లులు, తమ మాతృసదృశ ప్రేమలో విఫలులవుతారు. స్వానురాగి, చండశాసని, స్వాయత్త అయిన స్త్రీ, బిడ్డ చిన్నవాడుగా ఉన్నంతకాలం ''ప్రేమమూర్తి''గా ఎంతో బాగుంటుంది. కాని ఎడబాటు సమయం ఆసన్నమయ్యేసరికి ఆమె నిలవలేదు. నిజంగా ప్రేమించే స్త్రీకి మాత్రమే, పుచ్చుకోవడంలో కంటె ఇవ్వడంలో ఉండే, ఆనందమేమిటో తెలుస్తుంది. తన సత్తాను గుర్తెరిగిన స్త్రీ మాత్రమే బిడ్డ తననుంచి వేరయ్యేటప్పుడు గూడ, ''ప్రేమమూర్తి'' అవుతుంది.

ఎదుగుతున్న బిడ్డమీది మాతృసదృశ ప్రేమ, స్వార్థ రహితమైన ఆ ప్రేమ, అన్ని ప్రేమలలోకి కష్టమైంది. ఏ తల్లి అయిన తన బిడ్డను తేలికగానే ప్రేమిస్తుంది. దీనిని చూచి ఆమెను ''ప్రేమమూర్తి'' అని భ్రమపడే ప్రమాదం వుంది. ఒక స్త్రీ నిజమైన ''ప్రేమమూర్తి''

**CUDDLE CHEMICAL**

The brain's pituitary gland secretes **oxytocin** ("the cuddle chemical"), which stimulates sensations during lovemaking and produces feelings of relaxed satisfaction and attachment.

ఎప్పుడవుతుందంటే, ఆమె, భర్తను, బిడ్డను, కొత్తవారిని, మానవాళిని ప్రేమించగలిగిన ప్పుడు. ఇలా ప్రేమించడం చేతగాని స్త్రీ తన పసిబిడ్డలంటే వాత్సల్యం చూపే ''మాతృ మూర్తి'' కావచ్చు కాని ''ప్రేమమూర్తి'' మాత్రం కాలేదు. బిడ్డ పెరిగే కొలది, అతనితో వేర్పాటుకు తల్లి సిద్ధంగా ఉన్నదా, లేదా అనేది మొదటి పరీక్ష. రెండవ పరీక్ష, వేర్పాటు అయిన అనంతరం గూడ తల్లి ప్రేమను ఉపసంహరించుకోకపోవడము.

**(c) కాముక ప్రేమ (Exotic Love)**

భ్రాతృ సదృశ ప్రేమ సముల మధ్య ప్రేమ. మాతృ సదృశ ప్రేమ నిస్సహాయుల యెడ ప్రేమ. ఈ రెండూ వేరు వేరు అయినప్పటికి, స్వభావ రీత్యా అవి ఒకే వ్యక్తికి పరిమితం కాకపోవడమనేది రెండింటికి సామాన్య లక్షణము. నేను నా సోదరుని ప్రేమించినట్లయితే నా సహోదరులందరిని ప్రేమిస్తాను. అంతేకాదు, పిల్లలందరిని ప్రేమిస్తాను; నా సహాయం అవసరమైన వారినందరిని ప్రేమిస్తాను. ఈ రెండింటికంటె భిన్నమైంది కాముకప్రేమ. ఇది సంపూర్ణ సంలీనం కోసం పడే తపన, అవతలి వ్యక్తితో సాయుజ్యం కోసం పడే తపన. స్వభావ రీత్యా ఇది కొద్ది మందికి మాత్రమే వర్తిస్తుంది. సార్వత్రికం కాదు. బహుశ ఇది అన్నిరకాల ప్రేమలలోకి భ్రమపూరితమైంది కావచ్చు.

ప్రేమలో ''పడడం''తోనే అంతకు ముందరి క్షణం వరకు వారిద్దరి మధ్య ఉన్న గోడలు ఆకస్మికంగా కూలిపోతాయి. ఈ పరిణామంలో కలిగిన ప్రేలుడు అనుభవంతో (Explosive experience) కాముక ప్రేమను తికమక చేస్తారు. కాని లోగడ చెప్పినట్లు, ఈ ఆకస్మిక సంయోగానుభవం, దాని స్వభావ రీత్యా, కొలదికాలం మాత్రమే నిలుస్తుంది. ప్రేమలో పడడంతోనే ఎంత కొత్తవాడయినా పాతబడక తప్పదు. అప్పుడిక ఇద్దరి మధ్య అధిగమించవల సిన అడ్డుగోడలు ఏమీ మిగలవు. అందుకని ఆకస్మిక సాన్నిహిత్యానికి తావు వుండదు. తనను గురించి తెలిసినంత ''ప్రేమించినవాని'' గురించి తెలిసిపోతుంది. లేదా బహుశ అసలు తెలియదని చెప్పాలి. రెండవ వ్యక్తి వలన లభించే అనుభవంలో ఇంక చవిచూడని లోతులుంటే, అతని మూర్తిమత్వ అమితత్వాన్ని అనుభవించగలిగితే, అతడు ఎప్పుడు కొత్తవాడుగానే వుంటాడు. అప్పుడు అడ్డుగోడలు కుప్పకూలే అనుభవం నిత్యనూతనంగానే వుంటుంది. కాని చాలమంది విషయంలో, పరస్పరం మిగలకుండ తెలుసుకొంటారు కనుక, కొత్త మోజు మాయమవుతుంది. వారి మధ్య సన్నిహితత్వం లైంగిక సంయోగం ద్వారా వచ్చింది. రెండవ వ్యక్తితో ఎడబాటు వారి దృష్టిలో భౌతిక వేర్పాటు. అందుకని భౌతిక (శారీరక) సంయోగంలో వేర్పాటును అధిగమించడ మవుతుంది.

చాలామంది దృష్టిలో వేర్పాటు అధిగమించడానికి ఇదొకటే మార్గం కాదు. ఇంక అనేక మార్గాలు ఉన్నాయి. తన ఆంతరంగిక విషయాలను, ఆశానిరాశలను, బాధలను ఇతరుల ముందు వెళ్ళబోసుకోవడం, చిన్న పిల్లల వలె ప్రవర్తించడం లేదా వారి లక్షణాలను

*Love is a romantic designation for a most ordinary biological - or, shall we say, chemical? - process. A lot of nonsense is talked and written about it.*

- Greta Garbo to Melvyn Douglas in Ninotchka.

ప్రదర్శించడం, ప్రపంచముతో ముఖాముఖి సంబంధాన్ని నెరపడం - వీటిద్వారా ఎడబాటును అధిగమించవచ్చునను కొంటున్నారు.. అసహ్యాన్ని ప్రదర్శించడం సాన్నిహిత్యమనుకొంటున్నారు. కోపం, నిగ్రహ రాహిత్యం సాన్నిహిత్యమను కొంటున్నారు, ఈ సాన్నిహిత్యం, దంపతులు శయ్య జేరినప్పుడు, పరస్పరం కోపతాపాలు వెళ్ళగ్రక్కినప్పుడు మాత్రమే వ్యక్తమయ్యే విలక్షణమైన ఆకర్షణ. కాలంలో ఇటువంటి అన్నిరకాల సాన్నిహిత్యం బలహీనమవుతుంది. ఫలితంగా కొత్త వ్యక్తి నూతన వ్యక్తి ప్రేమను కోరడం జరుగుతుంది. మళ్ళీ ఈ కొత్త వ్యక్తి ''సన్నిహితు'' డవుతాడు. తిరిగి ప్రేమలో పడడం లోని పులకింత తీవ్రంగా వుంటుంది. క్రమంగా అందులో మోజు తగ్గి మరొక కొత్త ప్రేమకు దారి తీస్తుంది, పాత ప్రేమ కొత్త ప్రేమ కంటె భిన్నమైనదనే భ్రాంతి ఇలాంటి ప్రేమల్లో ఎప్పుడూ వుంటుంది. ఈ భ్రాంతి పెరగడానికి కారణం లైంగిక వాంఛలోని మోజు.

లైంగిక వాంఛ సంలీనాన్ని కోరుతుంది. అది వట్టి భౌతిక క్షుధకాదు. భాధాకరమైన ఉద్రేకాన్ని ఉపశమింపజేసేది మాత్రమేకాదు. ప్రేమ కామవాంఛను ఉద్దీపింపజేసినట్లే, ఏకాంతవ్యాకులత జయించాలి. జయించ బడాలనేవాంఛ, ఏడ్పించాలనేకోర్కె, వినాశకరవాంఛలుగూడ కామవాంఛను రేకెత్తించగలవు. ఏ తీవ్ర ఉద్వేగంతో నైన కామవాంఛ మిళితమై పోగలదనిపిస్తుంది. అలాగే అది ఏ తీవ్ర ఉద్వేగాన్నయినా ఉద్దీపింపజేయగల దనిపిస్తుంది. ఆ తీవ్ర ఉద్వేగాలలో ప్రేమ ఒకటి. అనేకుల దృష్టిలో ప్రేమ, లైంగిక వాంఛ జతపడి ఉంటాయి. అందువలన శారీరకంగా పరస్పరం పొందు కోరినప్పుడు వారు ప్రేమించుకొంటున్నామని భ్రమలో పడవచ్చు. కామ వాంఛను ప్రేమ రేకెత్తించగలదు. ప్రేమ రేకెత్తించిన పొందులో మార్దవం ఉంటుంది: లోభం ఉండదు; జయించాలని, కాని జయించబడాలనికాని కోర్కె ఉండదు. కామవాంఛను ప్రేమ కదిలించక పోయినట్లైతే, కాముక ప్రేమ భాతృసదృశ ప్రేమగూడ కానట్లయితే, అటువంటి సంయోగం క్షణికమైన తన్మయత్వానికి మాత్రమే దారి తీస్తుంది. లైంగిక ఆకర్షణ, ఆక్షణంలో, సంలీనభ్రాంతిని కలిగిస్తుంది. అయినా, ప్రేమలేని ఈ ''సంయోగం''వల్ల పొందుకు ముందు వారెంత క్రొత్తవారో, పొందుతరువాత అంతే కొత్తవారుగ ఉండిపోతారు. ఒక్కొక్కసారి ఒకరిని చూచి ఒకరు లజ్జితులవుతారు, అసహ్యించు కొంటారు. ఎందువల్లనంటే, ఆ మోహభ్రాంతి తొలగిపోయిన తరువాత, మునుపటి కంటె తరువాత, విరక్తి కొట్టవచ్చినట్లు కనిపిస్తుంది. మార్దవత, ఫ్రాయిడ్ అనుకొన్నట్లు, లైంగిక సహజాతం ఉదాత్త రూపంకాదు. అది భ్రాతృసదృశ ప్రేమ ప్రత్యక్ష ఫలము. అది ప్రేమ భౌతిక, అభౌతికరూపాలు రెండిటిలోను ఉంటుంది. మాతృసదృశ భాతృసదృశ ప్రేమలకు పరిమితి ( మినహాయింపు) లక్షణం ఉండదు. కాని కాముకప్రేమ ఇద్దరికి మాత్రమే పరిమితమై, మిగతావారిని మినహాయిస్తుంది (Excludes). కాముక ప్రేమకున్న ఈ నిషేధక లక్షణాన్ని గురించి ఇంకకొంత చర్చించవలసి ఉంది. కాముక ప్రేమలోని మినహాయింపును

"I get a kick out of you." "Love is a natural high," observes Anthony Walsh, author of *The Science of Love: Understanding Love and Its Effects on Mind and Body*. "PEA gives you that silly smile that you flash at strangers. When we meet someone who is attractive to us, the whistle blows at the PEA factory"

స్వాధీన బంధమని (Possessive attachement) తప్పుగ అర్థం చేసుకొంటారు. పరులను ప్రేమించలేని ఇద్దరు పరస్పరం "ప్రేమలోపడడాన్ని" మనం చూస్తూనే ఉంటాము. వాస్తవానికి ఇది అహంకారపూరితమైన ఇద్దరి మధ్య ప్రేమ; పరస్పరం తాదాత్మ్యం చెందే ఇద్దరు వ్యక్తులు వాళ్ళు. ఒక వ్యక్తిని ఇద్దరు వ్యక్తులుగా విస్తరింప జేయడంతో వారు ఒంటరితనాన్ని జయించిన అనుభవాన్ని పొందినవారవుతున్నారు. అయినా, వారిద్దరు మిగతా మానవులందరిని మినహాయిస్తున్నారు కనుక, వారు పరస్పరం దూరులైనట్లే, అంటే తమకు తాము దూరలైనట్లే. వారి సంలీనాను భవం భ్రాంతి మాత్రమే. కాముకప్రేమ పరిమిత మైన (ఇద్దరి) దీ అయినా అది అవతలి వ్యక్తిలోని "మానవాళికి సంబంధించిన దానినంతా", అతనిలోని "సజీవమైన దానినంతా" ప్రేమిస్తుంది. "నేను ఒక వ్యక్తితో మాత్రమే పూర్తిగా, గాఢంగా సంలీనం కాగలను," – ఈ అర్థంలో కాముకప్రేమ నిషేధక (పరిమిత) గుణాన్ని అర్థం చేసుకోవాలి. కాముకప్రేమ మిగతా వారితో సంయోగాన్ని ఒప్పుకోదు. దీనిలో జీవితాన్ని పూర్తిగ అర్పించడానికి వీలుండదు. కాని భ్రాతృసదృశ ప్రేమకు ఇందులో చోటు ఉంటుంది.

కాముకప్రేమే ప్రేమ అయినట్లయితే, దానికి ఒకపూర్వ సిద్ధాంతం ఉంది; నేను నా జీవితసారం నుంచి ప్రేమిస్తున్నాను. అవతలి వ్యక్తి జీవితసారాన్ని గ్రహిస్తున్నాను. దీని సారాంశం మానవులంతా ఒకటేనని, మనమంతా ఆ "ఒకటి"లోని భాగాలము. మనమంతా "ఒకటే." అలాంటప్పుడు మనం ఎవరిని ప్రేమించినా ఒకటే. ప్రేమ సంకల్ప ఫలం కావాలి, మరొక వ్యక్తికి నాజీవితాన్ని పూర్తిగ అంకితం చేయాలనే నిర్ణయానికి ఫలితం కావాలి. 'వివాహ బంధం తెంపరానిది' అనేదాని వెనుక ఉన్న అర్థం ఇదే. సనాతనంగా వస్తున్న అనేక రూపాల వివాహవ్యవస్థల వెనుక ఉన్న తర్కం ఇదే. సనాతన వివాహాలలో దంపతులు ఒకరినొకరు ఎన్నుకోరు. ఎన్నిక చేయబడతారు. అయినా వారు ప్రేమించుకొంటారని అందరూ విశ్వసిస్తారు. కాని సమకాలీన పాశ్చాత్య సంస్కృతికి ఈభావం తప్పు అనిపిస్తున్నది. అప్రయత్న, ఉద్వేగ ప్రతిచర్యనుంచి ఆకస్మిక అనివార్య సంవేదననుంచి ప్రేమ పుడుతుందని వీరు భావిస్తున్నారు. ఈ అభిప్రాయం ప్రకారం ప్రేమలో పడ్డ ఆ ఇరువురికి వ్యక్తిగత విశేషాలు మాత్రమే ద్యోతకమౌతాయి. అంతేకాని, మగవారంతా ఆడమ్‌లోని భాగాలుగ, ఆడవారంతా ఈవ్‌లో భాగాలుగ కనిపించరు. వీరు కాముకప్రేమలో ఒక ముఖ్యమైన విషయాన్ని -సంకల్పాన్ని విస్మరిస్తారు. ఎవరినో ఒకరిని ప్రేమించడమనేది బలవత్తరమైన సంవేదన కాదు; అందులో ఒక నిశ్చితం ఉంది, తీర్మానం ఉంది, వాగ్దానం ఉంది. ప్రేమ ఒక సంవేదన అయితే దానికి శాశ్వతమైన ఆధారమేదీ ఉండదు. సంవేదన వస్తుంది, పోతుంది. అది శాశ్వతం కాదు. నేను చేసే పని ఒక నిర్ణయంమీద ఆధారపడనప్పుడు అది ఎల్లకాలం అలాగే ఉంటుందని ఎలా చెప్పగలను?

ఈ దృక్పథాలన్నింటిని మనస్సులో ఉంచుకొంటే, ప్రేమకు కావలసింది సంకల్పం, నిర్ణయం, వాగ్దానము. అందువలన ఎవరు ఎవరిని ప్రేమించారనేది ముఖ్యం కాదు. అందువలన ప్రాథమికంగా వ్యక్తులు అప్రస్తుతము; పెద్దల నిర్ణయమైన, స్వయంపరమైనా, ఒకసారి పెండ్లి అంటూ జరిగిన తరవాత ప్రేమకు సంకల్పం పూచీనివ్వాలి. ఈ దృక్పథం మానవ స్వభావంలోని, కాముక ప్రేమలోని, విరోధాభాసను మరిచిపోయినట్లు కనిపిస్తుంది. మన మంతా ఒకటే - అయినా ఎవరి ప్రత్యేకత లక్షణాలు వారికి ఉన్నాయి. ప్రతి ఒక్కరు

అద్వితీయు (unique) లే. ఇతరులతో మనమంతా ఒకటే అన్నంతవరకు, భ్రాతృ సదృశ ప్రేమలో లాగ ప్రతి ఒక్కరిని మనం ప్రేమించగలము. కాని మనమంతా వేరు వేరు అన్నంతవరకు, కాముక ప్రేమలోలాగ, అందరిమధ్య కొందరినే ప్రేమిస్తాము.

అలాంటప్పుడు కాముక ప్రేమకు రెండు దృక్పథాలున్నాయి: కాముక ప్రేమ పూర్తిగ వైయక్తిక ఆకర్షణమనీ, అది ఇద్దరి మధ్య అద్వితీయంగా ఉంటుందనీ ఒక దృక్పథము. రెండవది కాముకప్రేమ సంకల్ప ఫలితమనేది. ఈ రెండూ యథార్థాలే. ఇంకా సరిగా చెప్పాలంటే, అసలు నిజం అదీ కాదు, ఇదీ కాదు. ఏ పరిస్థితులలోను ఒక బంధాన్ని తెగతెంపులు చేసుకోవడానికి వీలు లేదని భావించడం ఎంత పొరపాటో, మనకు నచ్చినప్పుడెల్ల ఒక బంధాన్ని తెంచుకోవచ్చునుకోవడం అంతే పొరపాటు.

### (d) స్వానురాగము (Self Love)

ప్రేమ భావనను వివిధ వస్తువులకు అన్వయించడంలో దోషం ఏమీ లేకపోయినా 'పరులను ప్రేమించడం మంచిది. తనను తాను ప్రేమించుకోవడం స్వార్థం' అనే విశ్వాసం జనంలో బాగా పాతుకుపోయింది. నన్ను నేను ఎంతవరకు ప్రేమించుకొంటానో అంతవరకు నేను ఇతరులను ప్రేమించడం లేదు. కనుక స్వానురాగం స్వార్థం ఒకటే అని భావించబడుతుంది. పాశ్చాత్య తత్వంలో ఈ భావం ఎంతో కాలం నుంచి వుంది. కాల్విన్ (Calvin) స్వానురాగాన్ని ఒక తెగులు (Pest) అన్నాడు. స్వానురాగాన్ని గురించి ఫ్రాయిడ్ మానసిక చికిత్స పరంగా మాట్లాడతాడు. అయినా అతడు చెప్పినదానికి కాల్విన్ చెప్పినదానికి తేడా లేదు. అతనికి స్వానురాగమంటే నార్సిజమ్, తన లెబిడో తన మీదకి మరలడము. నార్సిజమ్ మానవ వికాసంలో ప్రప్రథమ దశ. తరవాతి జీవితంలో ఈ నార్సిజమ్ దశకు మరలిన వ్యక్తికి ప్రేమించే శక్తి వుండదు; ఇది విపరీతంగా ముదిరిపోతే పిచ్చివాడంటారు. ఫ్రాయిడ్ , ప్రేమను లెబిడో అభివ్యక్తీకరణంగా భావిస్తారు. లెబిడో ఇతరులవైపు మరలడం గాని (ప్రేమ), లేదా తన వైపు మరలడంగాని (స్వానురాగం) జరుగుతుంది. ప్రేమ, స్వానురాగాలు ఈవిధంగా పరిహరించుకొంటాయి. ఎలాగంటే ఒకటి ఎక్కువైనప్పుడు రెండవది తక్కువ అవుతుంది. స్వానురాగం చెడ్డదైతే, నిస్వార్థం మంచిదని చెప్పపనిలేదు.

సహజంగా మనకు ఈ క్రింది ప్రశ్నలు ఉదయిస్తాయి: 'స్వప్రేమ, పరప్రేమలు పరస్పర విరుద్ధాలు', అనే వాదాన్ని మనోవిజ్ఞాన శాస్త్రం బలపరుస్తుందా స్వప్రేమ, స్వార్థం - రెండూ ఒకటా లేక వ్యతిరేకాలా? అంతే కాకుండ ఆధునిక మానవుని దృష్టిలో, స్వార్థం అంటే, తన బౌద్ధిక, ఔద్వేగిక ఇంద్రియ శక్తులతో సహా వ్యక్తి, తన మీద తను అపేక్షను చూపడమేనా? తను నిర్వహించే సాంఘిక-ఆర్థిక పాత్రకు ''అతడు'' (He) అనుబంధం (Appendage) కాలేదా? అతని స్వార్థమూ, స్వానురాగం రెండూ ఒకటేనా, లేక అది (స్వానురాగం) లేకపోవడం వల్ల అది (స్వార్థం) జనించడం లేదా?

స్వార్థం, స్వానురాగాలను మనోవైజ్ఞానికంగా పరిశీలించేముందు, పరుల మీద ప్రేమ, తనమీది ప్రేమ - రెండు పరస్పరం మినహాయించు (exclude) కొంటాయనే తార్కిక దోషాన్ని నొక్కి చెప్పాలి. పొరుగు వానిని ప్రేమించడం మంచిదనుకొంటే నన్ను నేను ప్రేమించుకోవడం చెడు కాదు, మంచిదే అవుతుంది. ఎందుకంటే నేను మనిషినే కదా! మానవ భావన (concept of man) లో నేను భాగాన్నే కదా! నన్ను మినహాయించిన

మానవ భావన అంతర్వ్యాధకు (intrinci contradiction) గురి అవుతుంది. తనను తాను ప్రేమించుకోవడం తనను తాను అర్థం చేసుకోవడాలు, మరొక వ్యక్తిని గౌరవించడం, ప్రేమించడం, అర్థం చేసుకోవడాల నుంచి విడదీయరానివని ''పొరుగువానిని నీవలె ప్రేమించు'' అన్న బైబిల్ వాక్యం చెబుతుంది. నామీద నాకు ఉన్న ప్రేమ, ఇతరులమీద ఉన్న ప్రేమతో విడదీయరాని సంబంధాన్ని కలిగి వుంది.

మన సిద్ధాంతాల కాధారమైన ప్రాథమిక మనో వైజ్ఞానిక విషయాలను చేరుకొన్నాము. మామూలుగా ఆ విషయాలు ఇవి: మన సంవేదనలకు వైఖరులకు, ఇతరులకే కాక, మనకై మనం గూడ ''వస్తువుల'' (objects) మవుతాము. ఇతరుల యెడ వైఖరికి తనయెడ వైఖరికి మధ్య వైరుధ్యం లేదు. అవి రెండు ప్రాథమికంగా సంయోజకాలే (conjunctive). మనం చర్చిస్తున్న విషయాన్ని దృష్టిలో ఉంచుకొని చూస్తే వీటి అర్థం ఇది: ఇతరుల యెడ ప్రేమ తనయెడ ప్రేమ వైకల్పికాలు (Altrenates) కావు. అంతేకాక ఇతరులను ప్రేమించగలవారు తమను తాము ప్రేమించుకోగలుగుతారు. స్వ ఆత్మ, ''వస్తువుల మధ్య సైద్ధాంతికంగా ప్రేమ అవిభాజ్యము. నిజమైన ప్రేమ సృజనాత్మకతను వ్యక్తం చేస్తుంది. దానిలో అపేక్ష, గౌరవం, బాధ్యత, అవగాహన ఉంటాయి. ప్రేమ ఎవరో ఒక వ్యక్తి తెప్పించే ప్రభావకం (affects) కాక ప్రియుని వికాసం, సుఖ సంతోషాల కోసం ప్రేమ సత్తాలో నాటుకొని ఉన్న క్రియాకీలక మైన ఆరాటము.

ఒకరిని ప్రేమించడమంటే, ప్రేమించే సత్తాను కూడ దీసుకొని, యథార్థం చేసుకోవడము. ప్రేమలో ఉన్న ప్రాథమిక నిశ్చయం, ప్రేమించిన వ్యక్తిని మానుషగుణాల అవతారంగా గ్రహించి, దానిపైపు నిర్దేశిత మవుతుంది. ప్రేమించడమంటే మనిషిని యథాతథంగా ప్రేమించ డమే. విలియమ్ జేమ్స్ చెప్పిన ''శ్రమవిభజన'' రీతిలో ఒకడు తన కుటుంబాన్ని ప్రేమించి, కొత్తవానిని ప్రేమించలేకపోతే అది ప్రాథమిక ప్రేమ అసమర్థతకు గుర్తు. తరుచు మనం అనుకొన్నట్లు, ఎవరో ఒకరిని ప్రేమించిన తరువాత అందులో నుంచి ఉత్పన్నమయ్యే అమూర్తభావన కాదు ప్రేమ. ఎవరినో ఒకరిని ప్రేమించడంలో అది ఉత్పన్నమవుతున్నప్ప టికీ, దానికి మాతృక అదే.

దీనిని బట్టి ఇతరులు నా ప్రేమకు ఎలా వస్తువులో 'నేను' అంతేనని తెలుతుంది. జీవితాన్ని, సుఖసంతోషాదులను, స్వేచ్ఛావికాసాలను నిరూపణం చేసుకోవడమనేది అతని ప్రేమసా మర్థ్యం మీద ఆధారపడి ఉంటుంది. అంటే, అపేక్ష గౌరవం, బాధ్యత, అవగాహనలతో వేరూని వుంటుంది. ఒక వ్యక్తి సృజనాత్మకంగా ప్రేమించగలిగినప్పుడే తనను తాను ప్రేమించుకోగలుగుతాడు. అతడు ఇతరులను మాత్రమే ప్రేమించగలిగితే, అసలతడు ప్రేమించనేలేడు.

(సశేషం)

Printed, Published and Edited by ALAPATI RAVINDRANATH at Kala Jyothi Process Pvt. Ltd., 1-1-60/5, Iftekar Mansion Lane, R.T.C. X Roads, Musheerabad, Hyd-20. Ph. 612436, 612337.

**Editorial NEST**

Plot No. 337 A, Road No. 10, Jubilee Hills, Hyderabad-500 034. Ph. 247717

- A rubber plantation in the name of Mrs. Alexander at Kariujunom village of Idukki district in Kerala.
- One farm house consisting of about 9 acres of agricultural land with a farm house in the name of Mrs. Alexander at Byrathi village in Bangalore district.
- A rubber plantation in the name of Mr. Jose Alexander at Mutton village, Idukki district.
- A site measuring 50 cents with a small house situated at Kilikollur village in Quilon district in the name of Mrs. Alexander.
- A plot of 10 cents of land in Kilikollur village in the name of Mrs. Alexander.
- Two seaside villas to be used as beach resorts, one in the name of Mrs. Alexander and another in the name of his son, at Quilon.
- A farm measuring about 7 acres at Pastandoor Agrahara, K.R. Puram Hobli, Bangalore district with a house being constructed on the land.
- Gold ornaments weighing 2401.05 grams valued at Rs.8.5 lakhs.
- LIC policies to be the tune of Rs. 7 lakhs in the name of Mr. Alexander and his family members.